

తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము.

——:o:——

చదువరులారా !

ఈ మా పాండవాశ్వమేధ నాటకమునకు ద్వితీయ ముద్రణమునందలి పీఠిక చాలవిస్తరించి లిఖింపఁబడుటయేకాక ప్రతిపుటయందును బ్రతిపక్షులొనర్చు శంకలకు సంబంధించిన సమాధానములనుగూడ లిఖించియుంటిమి. ఆ ప్రతిపక్షులెవరో యెందులకు వారట్లు లిఖించిరో లోనగు నంశములు గీరతమువలన నిదివఱకే సర్వజన విదితమైయుంటంజేసి యిందుమరల నాప్రసంగము నెత్తవలసినదిలేదు. ప్రతిపక్షుల యాక్షేపణ గ్రంథముపేరు శతఘ్ని. మాసమాధాన గ్రంథము పేరు పాశుపతము. మరల దీనిపై ప్రతిపక్షులు పరాస్తపాశుపతమని యేమోకొంతవ్రాయుటయు దానిపై పురశ్చరణమును మేమువ్రాసి మందలించుటయుంగూడ సుప్రసిద్ధమే కావలయు వారందఱుం జూడఁగోరెదము. గ్రంథవిస్తరభీతిచే నాపాశుపతము నిందు ముద్రింపక విడిచినను మాకునితరులతోనడచిన వాదోపవాదములకు సంబంధించిన యంశముల నెల్లఁ గ్రోడీకరించి యొకపొత్తముగా నచిరంబునన ముద్రింప నెంచితిమి. మఱియు నీయశ్వమేధనాటకముపైని యిపుడుదాహరించిన విమర్శనమంత నిస్సారముగాదు కాని యేమైనను సారమనుటకుఁదగని వేఱొక విమర్శనము నేఁటికి సుమారు రెండు వత్సరములనాఁడు బయలువెడలి యదియును వెనువెంబడిగ మాచే ఖండింపఁబడినది. ఈవాదోపవాదములు సమదర్శినియను పత్రికలో జరిగియుంటచే వలయువారద్దాని కతన నెఱుఁగఁగలరని యావిషయముఁగూడ మేమిపుడెత్తనేలేదు. మొట్టమొదటి విమర్శనములో నిజముగా మేము పొరఁబడిన స్థలమొకటికలదు. అదిగూడ దైవము మాయందుంటంజేసి మాచేనన్యథాగతిని సమర్థింపఁబడినది. అదిమాత్రమిట నుదాహరించుచున్నాఁడను.

(I) మరుద్భూపాలునిది, (పంచమాంకము)

ఇచ్చోట "మరుత్తభూపాలునిది" అని యుండవలయునని ప్రతిపక్షుల యాశయము. అది న్యాయమేయైనను. మేము—

మరుద్భూపాల శబ్దమునకు

శివుఁడని యర్థముచెప్పి విషయమెల్ల నన్యథాకరించి ప్రతిపక్షులకు వాకట్టు కల్పించుట యీక్రింది శ్లోకమును జ్ఞప్తికిఁ దేకమానదు.

"శ్లో॥ విదుషాం నివహైరిహైకమత్యా । ద్యదదుష్టం నిరటంకి యచ్చదుష్టం
మయిజల్పతికల్పనాధినాథే । రఘునాథే మనుతాం తదన్యథైవ"

ఇట్టియెడల మేము సమర్థించిన సమర్థనమున కాధారభూతమైన యంశమును జదువరులు భారతమున, అశ్వమేధపర్వమున, ప్రథమాశ్వాసమునఁ జదువఁగలరని యిట నుదాహరింపలేదు. ఇటీవల నిన్నమొన్న బయలుదేరిన విమర్శనము నిందుదాహరింపకున్నను ఆవిమర్శకులకు వాకట్టు కల్పించిన విధానమును మాత్రము క్రింద సంగ్రహముగా వివరించుచున్నాను. ఈవిమర్శనము మొదటివిమర్శనమువలె దురుద్దేశముతో బయలువెడలినది కాకపోయినను శంకలుమాత్రమున్నియు—

కుశంకలు

ఈహేతువుచేఁ గొంతకాలము పత్రికావాదము నడిచిన పిమ్మట నొక యుక్తి చేయఁబడినది. దాని స్వరూపమిట్టిది.

"అయ్యా? మీరిదేరీతిని విమర్శించుచుండెడల నేభాషయందుఁగాని యేకవికవిత్వమునందుఁగాని యేలేశమునుగూడ నిల్చునదియుండఁజేయుండదు. అట్లు మీరు నిల్చెడిది యుండునని నమ్మకమున్నచో సంస్కృతాంధ్రభాషలలో నేమహాకవి కవిత్వమునుండి యేని యొకశ్లోకమునో యొకపద్యమునో నాకొసఁగుఁడు. దానిని నేను మీవిమర్శనపు ఫక్కి ననుకరించి పాడుచేసి మీకుఁజూపఁగలను"

అను నర్థమొసఁగు మాటలను లిఖింపఁగా విమర్శకులు.

"శ్లో॥ అస్మాన్ సాధు విచింత్య సంయమధనాన్"

అను శాకుంతలనాటకమందలి శ్లోకమును నాకొసఁగిరి. వెంటనే వారివిమర్శనపు ఫక్కి ననుసరించి యాసుప్రసిద్ధ శ్లోకార్థమును సర్వాసహ్యమగునట్లు పదనుచేసి వారికిఁజూపఁగా వారంతటితో వాదమునుండి విరమించిరి.

"వాదదౌర్బల్యమేకాని వాదదౌర్బల్యముండదు" అని పెద్దలు చెప్పుదురు, కావున నింతమాత్రమున మా యీనాటకము సర్వానవద్యమని చెప్పఁజాలము కాని యిప్పటికి దీనింగూర్చి జరిగిన చరిత్రాంశమును జదువరులు తెలిసికొనుటకే ఆ యీ యంశములు లిఖింపఁబడినవి. నేను స్వయముగా ప్రూపుదిద్దికొనునప్పుడే శుద్ధపత్రిక వేయుట తప్పెడిదిగాదు. అట్టిచో శ్రీరంగపుడగు మాతిరుపతిశాస్త్రిగారికొమరుఁడు వేంకటావధాని ప్రూపురీడరుగానున్న యీముద్రణమున శుద్ధపత్రిక కవకాశమేలేకుండెడిని. కావున నింతతో నుపోద్ఘాతమును ముగించుచు ముఖ్యమైన సవరణల క్రింద నుదాహరించుచున్నాఁడను.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని.



శ్రీమత్పాం దేవతాయైనమః

# పాండవాశ్వమేధము.

తిరుపతి వేంకటీయము.

(నాటకము)

---

## (ప్రథమాంకము)

(నాంది)

ఉ॥ భారతసంగరాంతమునఁ బాండుతనూభవు లందుముఖ్యుఁడున్
భారము దీర్చి వారల కపారపురాజ్యమునిచ్చి యుత్తరా
దారకు సేమ మారసి పదంపడి వారల నశ్వమేధసం
చారులఁ జేయుకృష్ణుఁడు సృజిమ్ము యశమ్ము వశమ్ము శమిమ్ముదున్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి తెరవంకఁజూచి)

సూత్ర॥ మారిష! వేగ యీయాలస్యమేల? ఇటు రమ్ము.

మారి॥ (ప్రవేశించి) ఇదుగో వచ్చితిని, ఆలస్యమునకేమున్నది.

సూత్ర॥ ఎవరితోడనో దెబ్బలాటలతో వివదించుచున్నట్టున్నావు?

మారి॥ (తనలో) ఇంతవట్టుకు వినిపించినదే! (ప్రకాశముగా) ఇంక నెవరున్నారు? మన మైత్రేయుఁడు.

సూత్ర॥ పాపము శాంతించుఁగాక, గురువుతో గుద్దులాడ మొదలు పెట్టితివే! అందునను ఏగురువువనుగ్రహమ్మున మనమిట్టిరంగస్థలమున నిర్భయమ్ముగ నిలువఁ గలిగితిమో అట్టిభారతగురువుతోడ నేనా కలహించుట

మారి॥ (తనలో) భారతగురువెవరు? ద్రోణాచార్యులాయేమి? (యోజించి) కాదు భరతశాస్త్రగురువు కాఁబోలును (ప్రకాశము) గురువుతోఁ గాదు గురుపుత్రునితో.

సూత్ర॥ ఓహో! ఇదియా! నీతెలివి.

క॥ గురునకు గురుసుతునకు నంతరముండును వెఱ్ఱిగాని తత్తనయుని న
గ్గురునిబలె నరయ నేరని, మొఱకులుగూలుదురు నరకమున నిక్కముగన్

మారి॥ (గర్వముతో) సమయమువచ్చినచో నేను గురువునే లెక్కించువాఁడనుగాను, నాకితఁడు లక్ష్యమా!

సూత్ర॥ (నవ్వుచు) అవును తల్లిచెవులు త్రెంచువానికిఁ జినతల్లిచెవులు బీఱపువ్వులను గావఁట. సరే ఇంతకును గలహమెందుకుఁ దటస్థించినది?

మారి॥ ఎందుకా? ఎందుకేమిటి దుర్మార్గులకు, నిన్నరాత్రి నిదురఁబోవుచున్న మా పిల్లల నితఁడు కొట్టినాఁడఁట.

సూత్రి॥ అతఁడేమంత యవివేకి కాఁడే! నిదురబోవువారి నెందుకుఁగొట్టును? ఎట్టివారినేని యింతకుఁ గొట్టవలసిన యవసరమేమి? ఇది నమ్మఁదగినది కాదు ఈలాగని నీతోఁ జెప్పినవారెవ్వరు?

మారి॥ మాయింటి యజమాని పుట్టింటి నవుకరు, ఆపైని నాభార్యకుఁ గోపము వచ్చి యతని నెట్లేని యవమానింపకతప్పదనియు, నందులకు జరిమానాగా నాతని శిరోభూషణము దెమ్మనియుఁ బట్టుపట్టినది.

సూత్రి॥ ఆఁడువాండ్ర మాటలను బుచ్చుకొని మనము యుక్తాయుక్తములు విడిచి కలహమునకుఁ గాలుద్రివ్వవచ్చునా?

మారి॥ నేను గలహము కూడదనియే నేర్పుగా నే యడిగించినాఁడను.

సూత్రి॥ (కోపముతో) ఛీ! ఛీ! ఇంకను సిగ్గులేక యేమో చెప్పఁబోవుచున్నావు. గురుద్రవ్యాపహారముకూడ నీ కుచితమనితోఁచినదా? (తనలో) ఓహో ఈ ప్రశంసలోఁ బ్రకృతము మఱచితినే! (ప్రకాశము) సరే దానింగుఱించి పిదప మాటలాడికొందముగాని ఈనాఁడు మనము ప్రదర్శింపఁదగిన నాటకమెయ్యది

మారి॥ పాండవాశ్వమేధమని యూహించితిని.

సూత్రి॥ ఎట్లు?

మారి॥ మీరొనరించిన నాందినిబట్టి.

సూత్ర॥ చక్కఁగాఁ బోల్చితివి. ఈ గ్రహింపువలననే కాఁబోలును, మీరు తెరలో మొదటియంకము నప్పుడే కొంత ప్రదర్శించినారు.

మారి॥ (తనలో) ఓహో! ఈతఁడింకను అవిషయమై నన్నెత్తిపొడుచుచునేయున్నాడే (యోజించి) అయినను ఇప్పట్లు నాకిది యనుగ్రహమే (ప్రకాశము) అవును పాండవులకన్న మన మెక్కుడువారమా యేమి? వారు తప్పొనరించిన గురుపుత్రునిఁ బరాభవింపఁ బయత్నింపలేదా?

(తెరలో) ఎవఁడురా నన్నుఁ బరాభవించువాఁడు.

సూత్ర॥ (అనాకర్ణితముగా) సరే, యీ పోలికలకేమిగాని మనము కవుల ప్రశంస బొత్తిగా సభాస్తారులకు శ్రుతపఱుపమైతిమే.

మారి॥ ఈకవులంగుఱించి వేరే మనము చెప్పనక్కఱలేదు. తిరుపతి వేంకటేశ్వరులు శతావధానులు చర్లబ్రహ్మయ శాస్త్రిలవారి శిష్యులు అనిన నెల్లరును నెఱిఁగియే యుందురు.

సూత్ర॥ అవును ఆమాటనిజమే వీరు సుప్రసిద్ధులే వీరలిదివఱకనేక గ్రంథము లొనర్చియున్నవారలు.

(మరలఁ దెరలో) ఎవఁడురా నన్నుఁ బరాభవించువాఁడు?

మారి॥ (ఆకర్ణించి) అదుగో చూచితివా? ఇప్పటికిని విరమింపక మైత్రేయుఁడు నాపైఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వుచునేయున్నాఁడు.

సూత్ర॥ (నవ్వి) నీ గొడవనీది, అతఁడు మైత్రేయుఁడు గాఁడు అశ్వత్థామ, మన మీపాటికిఁ బోవుదము, (నిష్క్రమింతురు) ఇది ప్రస్తావన.

(అంతఁ గత్తిచేతఁబట్టుకొని రక్తసిక్తాంగుఁడై యశ్వత్థామ
కృపకృతవర్మలతోఁ బ్రవేశించును.)

అశ్వ॥ (క్రోధావేశసంతోషములతో)

ఉ॥ శత్రుల నెల్లఁ జక్కడఁచి స్వామిఋణమ్మును దీర్పఁగంటి స
త్పుత్రుఁడ నైతిఁ దండ్రితలఁ ద్రుంచినఘస్మరు నగ్గణించి లో
కత్రయ రాజ్య మబ్బినను గా దిఁక నింతటికన్న మోద, మీ
గాత్రము తోడఁ జేయఁదగుకార్యము లేదిఁక నాకు నెయ్యెడన్॥

(కొంచెమాలోచించి) లేకేమి? పాండవఘాతకులును గృష్ణసాత్యకులును గూడ నీవేమతోడనే వధింపఁదగినవారు. (తూర్పుదిక్కుచూచి) ఇంకను గొంత రాత్రి మిగిలియే యున్నది. ప్రభాత మగునంతవఱకును మహేశ్వరుని వర మనుసరింపఁదగినదే. (వెనుకకు మరలి) సఖా! దుర్యోధన! ఇదుగో నీ మనమ్మున నున్న కొఱఁతదీర్ప గురుపుత్రుం డేగుచున్నవాఁడు. సజీవుండవై యున్న నీకీవార్త వినిపింపని నన్నుమన్నింపుము. భీమగదాఘాతంబులనలిగియున్న నీవీమాత్రపు వార్తకేని నోఁచవేమో యని వారల వెదకక త్వరగా జరిగినవట్టు వినిపింపవచ్చితిని. కానిమ్ము,

క॥ పాండవులమరణ మదియొ, క్కండుగ్ దక్కంగ వింటికాదె! కడమ నీ
పిండంబులపై ధారకు, నుండుగ్ దప్పెమి? యిదియు నొక సంతసమే.

ఓరీ! ధర్మజ భీమార్జున నకులసహదేవులార?

ఉ॥ మాయలమారి కృష్ణుఁడు ప్రమాదము దప్పఁగఁ జేయఁ బోలు నీ
రేయి యపాండవంబు నొనరించినవాఁడన లేక యున్న, మీ
రేయెడ నేని యున్న నిదు రేగుఁడు నేనిదె సన్న్యసింపఁగా
నాయితమైతి నీ కొదవ యన్నది నా కిఁక నుండకుండుతన్.

(చెవియొగ్గి) ఎక్కడను బ్రతిశబ్దము వినరాదు. పాఱఁబోతులు ప్రత్యుత్తర మెందు కొసంగుదురు.

చ॥ ప్రదమున డాఁగెనంచు నృపు నాఁడెకూఁతలుకూసినట్టి మీ
రెచురిపుడేల రారుర, ఛీ! యిది పౌరుషమానుషోరి? దు
ర్మద మదియేడఁ బోయెనుర మాటున భీతిలి డాఁగుకన్నఁ జ
చ్చి దివికిఁ జేరుటొప్పదె యిసీ! యభిమానములేదె పందలే.

ఎక్కడ డాగుదురో చూచెదంగాక మిమ్మితఁడు శేషముమిగుల్చు వాఁడను కొంటిరే. (పోఁబోవును.)

కృపా॥ (నడుము గట్టిగా వెనుకనుండి పట్టుకొని) గురునందనా! శాంతింపుము శాంతింపుము. పాటిపోయినను జచ్చినను నొకటియేకదా! ఎందు కీయకాండ తాండవము.

అశ్వ॥ మామా! నీకు నమస్కారము నన్నీపట్టున నడ్డగింపకుము.

కృపా॥ ఇంతకన్నను విజయి వగుదువు కాక, ప్రభాతము కావచ్చినది. ఇప్పుడిఁక వారల వెదకుటకు వ్యవధి లేదు. శాంతింపుము.

అశ్వ॥ ఏమి! యింతకన్నను విజయమా?

శా॥ చంపీచంపని రీతిఁ జంపితిని దృష్టద్యుమ్ను, సైన్యమ్ములన్
గుంపుల్ గుంపులుగాఁగఁ గూల్చితిని, నేగుర్పాండవుల్ దక్క మా
యింపన్ జేసితిఁ బోటుమానిసుల, నాకీ నాఁటి కయ్యమ్మునం
దింపే పుట్టె దెదుర్కొనన్ గడఁగు వారెందున్ గనన్ రామిచే.

కృత॥ గురునందనా! అప్పటి మాటట్టులుంచుము. ఇప్పుడుమాత్రము నిన్నెవరేనిఁ దేఁటి పాటిఁ జూడఁగలరా?

తే॥ గీ॥ కట్టుపుట్టమ్ము లెల్ల రక్తముననిండి, నిదుర లేమిని గన్నుల నెత్తురులఁ
బూల నిండున శోకపు భూరుహమ్ము, ననుకరించుచునున్ గన నడలుపుట్టు

కృపా॥ కుమారా! నీవింతకుమున్ను చెప్పినదే యైనను విస్పష్టముగాఁ దెలియమిని మరల నడుగుచున్నాఁడను ఉపపాండవు లేమైరి?

అశ్వ॥ ఏమైరా? మేనమామలకుఁ దోడైరి.

కృపా॥ శివశివా! ఎంతపాతకము నొనరించితివి!

అశ్వ॥ (వెడనవ్వుతో) పాతకము గాక ఇందొకటి పుణ్యమున్నదా!

ఉ॥ పాపమొ పుణ్యమో విను మపాండవముగ్ బొనరించుపొంటె నే
నీపనిఁ బూనితిన్, మిగిలి రేవురు వారలు, వారిఁ జంపుటే
యాపసిబాలురన్ గెడపు, టేపయి వారలు రాజ్యమేలఁగా
నోపరు, దీనిచే మన సుయోధను చిత్తము సంతసిల్లెడున్.

ఇఁక నేనీ పాపోపశాంతికై తపంబు చేసికొన నేగెదం గాని మీరీయుభయార్త పుత్రశోకాతురుండగు నాంబికేయున కెఱిఁగించి యూఱడింపుదురుగాక!

ఉభయులు॥ మంచిది (వెళ్ళఁబోవుదురు.)

అశ్వ॥ మామా! మాట, రారాజుతో నిందాఁక నీమాట చెప్పితివా?

కృపా॥ ఏమాట?

"శ॥ ధృష్టద్యుమ్నుని నీకు న, నిష్టుని నిద్రించి యున్నయెడ నెన్నోన్నో
కష్టములు పెట్టి తుదకు నికృష్టంపుఁ జంపుఁ జంపి గడపితి నహహా.
ఇట్లు పుణ్యలోకగతుఁడగు మాతండ్రితోఁ జెప్పు" మనియేనా?

అశ్వ॥ అవును.

కృపా॥ చెప్పితివి మాకు బాగుగ జ్ఞాపకమున్నది.

కృత॥ ఇదియే కాదు. తక్కిన మనరాజులనందఱిని గూడ నడిగితి ననిసయితము చెప్పుమంటివి. నీవే క్రోధావేశముచే నిప్పుడు మఱచితివి.

అశ్వ॥ అట్లైనఁ గృతకృత్యుఁడనైతిని. మీరు చనుఁడు. నేనును బోవుచున్నాను. (కృపకృతవర్మలు నిష్క్రమింతురు.) (అశ్వత్థామ కొంతవఱకునడచి తనలో) అప్పుడే భగవంతుండగు సూర్యుఁ డుదయించినాఁడే?

క॥ మందేహు లనెడిరక్కసు, లందఱినిం దునిమి రక్తమది తన దేహం
బం దెల్లనిండ రవి నా,చందమునన్ సత్పదవిఁ జనియెడి నదుగో.

అవును ఇంతకన్న సన్మార్గమేముండును సన్న్యస్తశస్త్రుండనై తపంబున కేగుదుంటేఁగదా? (దృష్టినిగుడ్చి) అదుగో ద్వైపాయనాశ్రమము. ఇఁక ఖడ్గ మెందుకు? (ఖడ్గమునుద్దేశించి)

ఉ॥ భాగములన్ వధించెడికసాయి విధమ్మునఁ గుత్తుకల్ దెగం
గాఁ గెరలించి రక్తమును గంఠము నిండఁగ సారెసారెకున్
ద్రాగితి తృప్తినొందితి పినాకిపదమ్ముల వ్రాలి మ్రొక్కి నా
యాగతి నెల్లఁదెల్పఁ జనుమీ యిఁక నిన్నుఁ బరిత్యజించితిన్.

(ఖడ్గమును బాఱవైచి పరిక్రమించి) ఇదుగో ద్వైపాయనాశ్రమమ్మునకే వచ్చితినిఁక నిమ్మునులతోఁ గూడి వారు చెప్పినచొప్పున నిప్పాతకమ్మునకుఁ బ్రతికారమ్మొనర్చుకొనియెద. (వైమనస్యముతో జందెము చేతఁబట్టుకొని)

క॥ పుట్టినది బ్రాహ్మణుల మెటు, పట్టించితి వాయుధమ్ముఁ బట్టించితి వో
యిట్టిపనులు సేయింతురె, కట్టా! యజ్ఞోపవీతకమ? దయువలదే?

(తెరలో)

మ॥ గురుపుత్రుం డని మీకు సందియము గల్గుం గాక భీముండు ము
ష్కరులన్ సైఁచెడివాఁడు గాఁడు గురు వౌఁ గా కన్యుడౌఁ గాక దు
శ్చరితున్ జంపక యున్న రాజు చెడు వాత్సల్యమ్ము లేనట్టియీ
దురితాత్మున్ వధియించి ద్రౌపదికి సంతోషమ్ము గావించెదన్.

(కృష్ణార్జునులతో భీముఁడు ప్రవేశించును)

అశ్వ॥ కానిమ్ము దీని కేమి, మంచిపనియే చేయించితివిలే,

తే॥ గీ॥ పరశురాముండు నను రాజవరుల నెల్లఁ, దునిమెనని చెప్పుటది కొంత త్రిప్పి
పట్టె, మరలఁబోగ రెక్కనీరాచమండలంబు, తిరిగియును బ్రహ్మతేజమ్ము దలిపితీవు

అమ్మహాత్ముఁడు పోవుగతికే యేనునుం బోవుదుఁగాక. (సంశయముతో) అమంగ
ళము శాంతించుఁ గాక. అతఁడు తుట్టతుదకుఁ గురువంశజుఁడగు భీష్మునిచే నవ
మానింపఁ బడియె నట్టు నాకునుం గలిగెడి నని స్ఫురించుచున్నదే! (ధైర్యముతో)
కానిమ్ము బ్రహ్మశిరోస్త్రంబు నాయొద్ద నున్నంతవరకు నీకుఁ బంచజాలగు నర్జు
నుండును గిర్జనుండును, భీముండును గీయుండును వన్నేమి సేయగలరు.

(నిష్క్రమించును.)

భీము॥ బావా! యమనందన! నీవింత మెల్లగా రథము నడపినం గాదు త్వరగాఁ బోవ
నిమ్ము. లేదా నేను ముందుకేగెదను. మీరు వెనుక రండు. ("గురుపుత్రుండు"
అనునది మరలఁ జదివి పోఁ బోవును.)

కృష్ణు॥ (చేయి పట్టుకొని) బావా!

చ॥ గురుసుతుఁ డన్న నేమియనుకొంటివో! ద్రోణునికన్న నెక్కుడై
వ్వరి నవధ్యుఁ డీవు బలవంతుడవే యనుకొమ్ము మైనను౯
ద్వరపడు టొప్పునే! యతనిదర్ప మెఱుంగనిదే! యుపాయము౯
బలిపినఁ గాక మత్తకరిఁ బట్టుకొన౯ వశమౌనె? యేరికి౯

భీము॥ (కోపముతో) ఏమంటివి?

క॥ ఏమంటివి గురుసుతుఁడా, నానుందఱ నిల్చువాఁడు నాగడ యశ్వ
త్థామను గిశ్వత్థామను, భూమికిబలియొందె దీనిపాగ రెఱుఁగనిదే,

అర్జు॥ అన్నయ్యా! శాంతింపుము.

తే॥ గీ॥ ఆతఁడు చిరజీవి వివిధశస్త్రాస్త్రవేది, యతనిఁ జంపఁగ మనకెట్టు లలవియగును,
పరిభవమొనర్చి ద్రుపదాత్మభవకు దుఃఖ, భరము దీర్చుటయే పెద్దభరము తుదకు

క॥ ఇరువురము సమానమ్ముగ, గురునొద్దఁ జదివితిమి యగుం బుత్రుం డా
గురున కతండే శిష్యుఁడ, నిరువురకు౯ భేద మింత యిటనుండుఁ జుమీ.

చ॥ అతఁ డిటువంటిపూనికమెయి నాపాపభూమికి బుద్ధిపూర్వక
స్థితి నరుదేఁడు వచ్చినను జేసెడిచేఁతయె లేదు నేఁడు దు

ర్మతి యగునాసుయోధనుపరాభవముఁ విని స్వామియప్పు డీ
ర్భుతలఁపు పుట్టి యిప్పనికిఁ జొచ్చె నతం డతిరౌద్రమూర్తియై.

కృష్ణ॥ సంశయమేమి? వెనుక నారాయణాస్త్రము ప్రయోగించినప్పు డే మైనది? అది యీతఁడు మాత్రమెఱుఁగనిదా? భీష్మద్రోణకృపాశ్వత్థామలు నల్వురును మన కజేయులే. అయినను, అందు రెండు సముద్రముల నాయాయి యుపాయమ్ములం జేసి దాఁటితిమి. తక్కు రెంటితో మన కప్పుడంత యవసరమే లేకపోయినది. ఇప్పుడిప్పనియైనను,

క॥ అనయమతి యైనదుర్యో, ధను పంపునఁ జేసెఁ గాని తనయంతన తా
నొనరించునె గురుసుతుఁ డెం, దును ధర్మాధర్మపద్ధతులు నేరఁ డొకో.

అర్జు॥ సంశయమేమి? యెంతయోగ్యుల కైనను రాజనిరోధమ్మునఁ గొన్ని యకృత్యమ్ములు పొసఁగుచుండును.

చ॥ గురుఁడును భీష్ముఁడుఁ మనకుఁ గూర్చెడివారలు కారె, వార లి
ర్వురుఁ జనుదేరె యుద్ధమునఁ బోరఁగఁ, జంపరె పెక్కుమంది, ని
ర్వురుఁ దమపూను వేషమును బట్టి చరించుట యొప్పదే! మతుల్
దిరుగవె! తన్మయం బగుగతిఁ బవరంబు లొనర్చుపట్టునన్.

కృష్ణ॥ నీవుచెప్పినదియే యిక్కడఁ దగియున్నది. నాటకములోని వేషధారులే యొకప్పుడు తన్మయు లగుచుఁ దత్తత్కృతులకు సిద్ధ మగుదురు. అట్టిచో నిజముగా యుద్ధసన్నద్ధు లగువారి కాయాసమయమ్ముల బంధుత్వాదికంబు పొడకట్టునే?

భీమ॥ యుద్ధసన్నద్ధు లగువారిఁ జంపిన నీతఁ డపరాధి యే కాఁడు.

క॥ ఎదఁ జేయి వెట్టికొని పోరి, నిదురించెడివారిఁ బట్టి నింద్య మనక చం
పెదరట? శూరులు; లోకం, బిది మెచ్చునె? పరము గలదె! యిహ ముండెడి నే?

కృష్ణ॥ ఆతప్పున కే కదా! యితఁడు గురుపుత్త్రుం డైనను బరాభవింపవలసి వచ్చినది. (పరిక్రమింతురు)

అర్జు॥ అదుగో ద్వైపాయనాశ్రమము. అటఁ బారాశర్యమునీంద్రులు శిష్య సహితము గాఁ బుణ్యగోష్ఠిచేఁ గాలంబపనయించుచున్నారు. వారిదర్శింప వలసినచో కాని వారిప్పటిమనయుద్యమమ్మున కంతరాయమొనరింతురు. కాన నిట నుండియే నమస్కరింపుదము. (రథమునుదిగుదురు నమస్కరింతురు)

భీము॥ (కొంతముందునడచి దృష్టినిగడ్చి) ఇదియే భాగీరథీతీరము మన మాతని నీయొ
డలనే వెదక వలయును.

కృష్ణ॥ అదుగో, యొకపిన్న సన్యాసి, కాఁడు కాఁడు అశ్వత్థామ.

తే॥గీ॥ కేలజపమాల మెయినిండరాలుబూది,దండమునుగమండలువుమోలిదర్భలొప్ప
నయనములు మోడ్చి కృష్ణాజినంబుమీఁదఁ,గూరుచున్నాఁడుతపసిమైగురునికొడుకు.

బావా! పవననందన!

చ॥ తనపొనరించు దుష్కృతికిఁ దద్దయుఁ బాండవు లగ్గి వత్తురో
యనుభయమో, యిసీ! ద్విజుఁడనై పొనరింపఁగ రానికృత్యముం
బొనరిచినాఁడ నన్నాపదయమో, ధ్యాయమో, గురునందనుండు విర
క్తినిఁ గనఁజేయఁ బోలుఁ, బరికింపుమ? యీతని దైనవేసమున్.

(అశ్వత్థామ ప్రవేశించును.)

భీము॥(పండ్లు పటపట గొఱుకుచు) నీవు మొదల నుడివిన హేతువే సరిగానున్నది
(ముందుకునడచుచు) ఓరీ! విప్రకులాధమ! భ్రూణహత్యాపరాయణ!

ఉ॥ ప్రాణకలాభిమాన మది భగ్నముగా నిసివేళఁ బోయి ని
ద్రాణులఁ జంపి దొంగవలెఁ దాపసివై యిట కేగుదెంచితే?
ద్రోణుప్రతిష్ఠ గంగఁ బడఁ ద్రోచితె? యింతన చావు దప్పునే?
ప్రాణము లింత తీపె? పసిబాలురఁ జంపితి వేమి? దుర్మతీ.

అశ్వ॥ (చూచి తనలో) ఓహో భీముఁడా! వెనుకఁ గృష్ణార్జునులుగూడనున్నట్లున్నా
రే! అగుం గాక వీరిలక్ష్య మేమి? (ఊరకొనును.)

భీము॥ తే॥గీ॥ లేచిరావేమి దొరి? నీపీఁచ మడఁతు, నీచపుంబనిఁ జేసియు నేమ మేల?
గురుసుతుండవటంచూరకొందుమనుచుఁ, దలఁపఁబోకుమ? యూదారితప్పనేఁడు

చ॥ చదివితి వేమి సార్థకము? శాస్త్రము వేదము మల్లవిద్దెలున్,
మది నొకయింత యున్ దయ యు మానము లేనివివేకహీనపుం
బ్రదుకు ను గన్యమే? యెటుకఁ బాటిన వెయ్యొడ సాచ్చినన్ క్షమిం
పదు గద! నే క్షమించినను మద్గద, యోరి? దయావిహీనుఁడా?.

(కృష్ణార్జునులు సమీపించుచున్నారు.)

అశ్వ॥ (తనలో) మనమూరకున్నను ఈతఁడూరకొనునట్లులేదు. ఈప్రేలరి కిదియే
యుత్తరం బగుఁగాక (తృణమునభిమంత్రించి) తల్లీ? బ్రహ్మశిరంబ?.

చ॥ ధర కలిగెం గదా! యనెడిదర్పమునన్ బొగరెక్కి "దేవునై
గురువునునై,, యమంగతిని గ్రొవ్విచరించెడి యిద్దురాత్ములన్
బొరిగొని నాదుపూన్కి మెయిభూమి నపాండవమున్ బొనర్చి య
క్కురుకులనాథుచిత్తమునకున్ ముదమున్ దనుకంగఁ జేయుదూ.

(విడచును.)

కృష్ణు॥ (తత్తఱముతో) అర్జునా? అర్జున!

ఉ॥ పావనిపల్కులన్ గనలి బ్రహ్మశిరంబు సరంపహుఁడై మహీ
దేవసుతుండు నించె, నిది ద్రిప్పఁగ నాకును నీకునున్ మహా
దేవునకున్ గడింది, వెస దీనికి దీని పంపు మయ్య, యా
పైవిధి చూమకొంద, మదె పావని చచ్చెడిఁ జచ్చెడిన్ సఖా.

అర్జు—(శరమభిమంత్రించి విడిచి)

శా॥ అమ్మా! బ్రహ్మశిరంబ, నాగురుఁడు ద్రోణాచార్యపుత్రుండు జీ
వమ్మం బాయక యుండఁగా వలయు, మావంశమ్మునున్ మేము సౌ
ఖ్యమ్మున్ గాంచవలెన్, బ్రపంచమునకున్ గష్టమ్ము రా రాదు నీ
విమ్మై నన్ననుగ్రహించి చనుమా? యీయస్త్రమున్ ద్రిప్పుమా?

(తెరలో) ఓహో సాత్యవతేయ? దగ్గఱ నుండియు నిట్టిపని చూచుచునూరకుంటి వేమి? వారింపుము. వారింపుము.

వ్యా॥ (ప్రవేశించి ఆకాశమువంకఁజూచి తనలో) ఓహో! నారదుఁవారివాక్యము లాయువి;

నార॥ (ప్రవేశించి) ఓ అశ్వత్థామార్జునులార!

కం॥ ఇప్పటికి నెన్నియుద్ధము, లిప్పడమిం జరిగె? నెవ్వరేనియు దీనిం
గుప్పిరె? యిది జగ మడఁపదె?. యిప్పాపపుఁబనికి మీర లెట్లొప్పితిరో?

వ్యా॥ అర్జునా! క॥ గురువన గురుసుతుఁ డన నొక్కరూపు గా కున్నె? యతఁడు
కనలిన మనకుం ద్వరపడుటు చితమె? శరమున్, మరలింపుము గాక జగము
మాయించెదవే?.

అర్జు॥ (వినయముగా మహాత్ములారా? క్షమించి నామనవి చిత్తగింపవలయు.

క॥ మీయానఁ గట్టుపడి నే, నాయస్త్రము గ్రమ్మఱింతు, నతఁ డారీతిన్
జేయునొ చేయఁడొ యది మీ, రేయూహింపఁగవలెఁ జూఁడి? దయకలిమిన్

(అస్త్రమువంకఁ జూచి) అస్త్రరాజమా!

తే॥గీ॥ గురువునెడ భక్తిఁ గలనేని కూళతనపుఁ, బనికిఁ జొరనేని భీతులఁ జెనకనేని
నిన్ను నమ్మి పూజించితినేని శాంతిఁ, జెంది లోకహితంబు సేసెదవుగాక.

నార॥ కుమారా! నీయస్త్రమ్ముం గూడ నుపసంహరింపుము.

అశ్వ॥ ఇదుగో యుపసంహరింపుచున్నాఁడను. (తనలో)

గీ॥ అతఁడు దేవాంశసంభవుఁ డగుటఁ జేసి, యధికగురుపాదనిరతాత్ముఁ డగుటఁ జేసి
యుపశమింపఁగ నేర్చె నా కుపశమింప, రాదు, చేసెడి దేమి? యీమీఁద నేను

ఇట్లగుంగాక (ప్రకాశముగ) మహాత్ములారా! వినుండు.

చ॥ ఎఱుఁగుదు నిట్టియస్త్రమును నేయుట తప్పని, రాజరాజు నాఁ
బరఁగు సుయోధనున్ శిరము ప్రయ్యఁగఁ దన్నినదానిచేఁ గ్రుధా
భరము సహింపలేక యిది పాండవులన్ గడతేర్పఁ బొంచె నేఁ
బఱపితి, లోకమీశరము బారికిఁ దా గురి గాక యుండుతన్.

వ్యా॥ ధర్మాత్ము లగు పాండవుల వధించుట నీతరము గాదు. మామాట విని మరలింపుము, మఱియు నింకొకటి వినుము.

తే॥గీ॥ పోరు దుర్యోధనునితోడఁ దీఱె మీకు, నిరువురకు నాలమియ్యది యెందుకొఱకు?

నార॥ ఎందుకొఱ కననేల? ఇతఁ డొనర్చినయకార్యమ్ముం బట్టి సహేతుకమే యయినను ఏదో యొకవిధమున సంధి యగుట శ్రేయము.

వ్యా॥ (ఆలోచించి) గురునందనా! యిపుడేని నీది తప్పనక తీఱదు. సత్యప్రతిజ్ఞులగు పార్థులు మిన్నకపోవువారు గారు, కావున

తే॥ గీ॥ నీశిరోమణి వారికి నేర్పఁజేని, సంధి యగు నింతకొండు పాసంగ దిందు

అశ్వ॥ (తనలో) ఓహో! మును లెంతపక్షపాతముగాఁ దగవు దిద్దుచున్నారు. అగుఁగాక మునినైతింగదా! ఇఁక వైరము తెగదు, ఈమణితో నాకేమి యవసరము? (ప్రకాశముగా)

చ॥ కురుపతిఁ గెల్చి రత్నములు కొల్లలుగాఁ గొనివట్టి ధర్మభూ
వరునకు నిట్టిరత్న మొకబ్రాంతియొ? విప్రులదివ్యమున్ గ్రహిం
చిరె? నెగడన్ దలంచు నృపశేఖరు, లిచ్చితి దీని నోమునీ
శ్వర! భవదర్పితమ్ముగ, భవద్వచనం బవిలంఘ్య మాటచే.

ఇద్దానిధరించువారలకు నాఁకలియు డప్పియు శ్రాంతియు నెప్పుడును జనింపవు

ఇట్టి నాప్రాణమ్ము నిచ్చియు నీకు శాంతి యెట్లు పొందఁ జేర్తును? (కోపముతో)

తే॥ గీ॥ బ్రాహ్మణస్వాపహారమ్ము పాండవులకు, వేడ్క గావున నిది పొండ వేయ
దార, గర్భముల నెల్ల హరియించు గాక పిదప, శాంతిగను గాక కనుఁ గాక
సంతసంబు.

కృష్ణ॥ (తనలో) ఓహో! యీదురాత్ముఁడు మరల నస్త్రమును బ్రజ్వలింపఁజేయు
చున్నాఁడే!

మునులు॥ అందొక్కటి మావచనంబున నిలుచుఁగాక.

కృష్ణ॥ విధిగా నట్లగుంగాక

అశ్వ॥ (తనలో) ఉత్తరాగర్భమునాఁబోలును (ప్రకాశముగా) మీపతుకుపాతవచనమ్ము
లిప్పట్ల సాఁగవు.

ఉ॥ మీరు ను మీరు నుంగలసి మెల్లఁగఁ జల్లనిమాట లాడినం
దీ కొడిపాటిగా దిది సుతీక్ష్ణము బ్రహ్మశిరోస్త్ర, ముత్తరా
దారకు గర్భమందు భసితం బొనరించెడిఁగాక దానిచేఁ
బోరిది యేల వచ్చెనని పొక్కుచు నుందురు గాక పాండవుల్॥

కృష్ణ॥ గురునందనా! యిటు చూడుము.

ఉ॥ నీదగునస్త్ర మిట్టి దని నేను నెఱుంగుదు నందుకే కదా!
నీదెస నింత చెప్పితిమి నీ వటు చంపెద వేని వానికే
నే దయఁ బ్రాణ మిచ్చితిని నీవిఁకఁ జేసెడి దేమి! పొమ్ము
గా దన నేల! నీకుఁ దగుఁ గాకిది యొడ్డకు నెందుఁ జెల్లునే॥

ఆకొక్కమరుండవు నీ మేనమామయొద్ద నేయస్త్రవిద్య నేర్చికొని భూమిం బరిపాలించుఁ గాక. నీవిప్పాపమ్మునకు జేసి మూడువేలేండ్లన్న వస్త్రమ్ములు దొరకక దుర్గంధ దూషితశరీరుండవై తిరుగుదువు గాక.

వ్యా॥ అదితప్పక యమోఘమ్మగుఁ గాక

అశ్వ॥ ఏమీ? నన్ను శపించితివిగా? నీకును నేను బ్రతిశాప మీయ నేర్తును గాని అయ్యొ
ది నేఁట రేపట నొక్క పతివ్రతాశిరోమణిచేఁ గానైయుంటఁ జేసి యూ
రకుంటి.

చ॥ విదురునియింట విందనుచుఁ బెట్టితి సంధి చెడంగ; నాజిలో
గుదురనివానిఁ బార్థుఁ బురికొల్పితి గీత లటంచుఁ జెప్పి, యా

పద గలవేళఁ గర్ణుపయిఁ బంపితి పార్థశరంబు, చక్రముం
దుద నొకసారి పట్టితివి ద్రోహము లియ్యవి కావె? మాధవా.

ఇవియిట్లుండుంగాక.

చ॥ నరుఁ డతిధర్మతత్పరుఁ డనం దగునుత్తముఁ డయ్యు నీవచ
స్స్ఫురణిఁ బోఁగి కాదె విరసమ్ములు పెక్కులొనర్చె, నాఁటిసం
గరమున సన్న సేయుటది కాపురుషుల్ పొనరించుకృత్యమా?
పరువు గలట్టియుత్తములపద్ధతియా? వివరింపు మో హరీ.

నీవు విష్ణ్వంశసంభూతుండ వగు మహానుభావుండ వగుటం జేసి నిన్నేమియు ననఁగూడదు కాని యైనను యథార్థమునకుఁ దప్పఁగూడదు గదా!

ఉ॥ కర్ణుఁడు దుర్ణయుం డనుచుఁ గౌరవనాథుని బాడుచేసె నీ
నిర్ణయ మాదరించి యవినీతులు పాండవులైరి, నీవునుం
గర్ణుఁడు లేక యున్నయెడఁ గౌరవపాండవయుద్ధ మున్నదే?
కర్ణుఁ డొకండె దుర్జనుఁడు గాఁడు సుమీ వసుదేవనందనా.

ఇఁక నొకమాట నీతోఁ జెప్పి విరమింప నెంచుకొన్నాఁడను. ఇదియుంగూడ సావధానంబుగ నాకర్ణింపుము.

ఉ॥ పావనుఁడైన ధర్మజునిఁ బట్టి పలార్చి నిరోధ పెట్టి నా
చావు వచింపఁ జేసి కలశప్రభవుం గికురించి చంపి తీ
రేవపుఁగార్యముల్ జగము నెల్లెడ నెవ్వ రెఱుంగనట్టివా
రీవిఁకఁ గోటిజన్మముల నెత్తిన సద్దురితమ్ము వాయునే.

ఇంకను నీదోసమ్ములనేకములు గలవు గాని నేఁ బోవుచుంటి క్షమించి నాయందు దయ యుంచుము. (నిష్క్రమించును.)

వ్యా॥ (రత్నమును భీమునికిచ్చి) నాయనా! పవమాననందన!

ఉ॥ ఈమణి నిచ్చి ద్రోణిశిర మే యనుకొమ్మని చెప్పి పుత్రశో
కామయమగ్న యౌ ద్రుపదునాత్మజ నూఱడిలంగఁ బల్కుఁడ
క్కామిని ధర్మజుం డనుఁగన్నులు గా మిము వేఁచి యుండు మీ
రీమెయి నిల్వకే చనుఁడ రేఁగును బోయెద మిచ్ఛకమ్ముగన్.

(ధర్మరాజును ద్రౌపదియుఁ బ్రవేశింతురు.) (వ్యాసాదులు నిష్క్రమింతురు)

ద్రౌప॥ అయ్యో! కుమారులారా! అభిమన్యునిమృతి కే విచారించుచుండ మీరుఁగూడఁ

గన్గొంటిరా? అయ్యో! అన్నలారా! అయ్యో తండ్రీ! అక్కటా! పుట్టినది మొదలెన్నఁడును సుఖమెఱుఁగనైతిఁగదా! అన్నా! జూదమా! యెంత చేసితివి.

ధర్మ॥ దేవీ! యీయడవిల్లుమాయడవిల్లును, క్షత్రియపుత్రుల కిట్టిమరణమే ఎప్పటికైన దటస్థించెడిది. (తనలో)

మ॥ గురులన్ జంపి కుమారులన్ గెడపి కౌరుల్ మన్నుగాఁ జేసి యి
క్కురువంశమ్మును బాండువంశమ్మును బొగ్గుల్ సేసి తేజుంచు నిన్
జిరకాలమ్మునుండి రాజవరులు చ్ఛేదింపరైరో దురో
దరమా! నీదగు పేరెఱింగియును గట్టా! మోసపోతింజుమీ.

ద్రౌప॥ అయ్యో! యీమహాకృత్యము వలదని కృపాచార్యులైన బోధింపకపోయెఁ గాఁబోలును. తండ్రులారా! యెంతదుర్మార్గులైతినోయి. (కృపాచార్యులు ప్రవేశించుచు)

కృపా॥ ద్రుపదరాజపుత్రీ! నేను బోధింపక పోయినవాఁడఁగాను. తల్లీ! యిది యెంతయు నవశ్యంభావి యగు కాలపుదౌర్మార్గ్యము, అట్లు కాదేని,

ఉ॥ ఏగురుఁ బార్థులన్ మిమ్మెయిన్ దొలఁగించిన యాదవోత్తముం
డీగుఱు తించుకం తెఱుఁగఁడే? యిటు లాటకు నొప్పి కాదె? తా
మేగడివేళ వీరి నిటనే దిగఁద్రావుట, నాఁటఁ బాండవుల్
డాఁగిరి గాని ప్రాణములు దక్కుట దుర్లభ మేరికేనియున్.

ధర్మ॥ ఆచార్యా! యెప్పటికన్న నాఁటివిశేషమేమి?

కృపా॥ చెప్పెద నవధరింపుము.

చ॥ అటులు సుయోధనుం డనుప నయ్యెడ కేగడివేళ మధ్య నొ
క్కట వికృతాకృతిన్ శివుఁడు గానఁగనై తుదకున్ బ్రసన్నుఁడై
"యిటు విధిచోదితంబ యగు మీవు నిమిత్త" మటంచు ఖడ్గ మొ
క్కటి దయచేసి తా నతని కాయమునం దిమిడెన్ స్వయమ్ముగన్.

ధర్మ॥ వింటివా? పాంచాల రాజపుత్రీ! ఇది ప్రళయకాలరుద్రుం డొనర్చినకృత్యముగాని యశ్వత్థామది కాదుసుమీ.

ద్రౌప॥ మనుజులునిమిత్తమాత్రులుగాని అన్నింటికిని భగవంతుఁడేమూలము. అయ్యో! తండ్రులారా! మఱఁదులయందు దయగల్గు శ్రీకృష్ణునకు మీయందు దయలేక

పోవుటయు నాదురదృష్టమే.

ధర్మ॥ పతివ్రతా శిరోమణీ! ఇది యవశ్యంభావియే కానిచో,

ఉ॥ వెన్నుఁ డెఱుంగనట్టిపని వీసము నుండ, దెఱుంగనట్టి భం
గి న్నటియించు భూధరము కేవలమాత్ర హరియించుపొంటెఁ దాఁ
బన్నె నటించు నింటఁ గురుపాండవయుద్ధ, మబద్ధ మౌనె? యా
పన్నులఁ బ్రోచు శౌరి కిది భారమె! వీరల కాయు వుండినన్.

కృపా॥ సమస్తధర్మవేదు లగుమీరలుచెప్పవలసినది లేశమునుంగాన రాదు. అమ్మా ద్రౌపదీ!

ఉ॥ ఏల సమస్తముం దెలిసి యిట్లు వృథా విలపించెదమ్మ? గో
పాలుఁడు నిన్నుఁ జెల్లెలిని బాలన సేయక మిన్న కుండునే?
వీ లోకయింతయున్న, నిదివిశ్వజనప్రళయుంబు, కానిచో
నాలములోన లేనిగురునాత్మజుఁ డేమిటి కల్గఁగా వలెన్.

ద్రౌప॥ ఎందు కన్గిన నేమి. నాకడుపునఁ జిచ్చు వెట్టెనుగదా. అయ్యో! బ్రహ్మణుఁడైపుట్టియిట్టియకృత్యమునకుఁ బాలుపడుట యెచ్చటనుగన్నదియు విన్నదియుఁ గాదు. కొడుకులారా! అప్పాపాత్ముఁడు మిమ్మెంత కష్టపెట్టిచంపెనోకదా!

ధర్మ॥ (ఆలోచించి) ఆచార్యా! యిఁకనొక్క బాహ్యకారణ మియ్యెడ లేకపోలేదు సుమీ!

చ॥ ద్రుపదునినాఁటనుండియును ద్రోణునికిం బడ, దక్కతమ్మునన్
ద్రుపదసుతుండు ద్రోణుతల ద్రుంచె నధర్మము గాఁగ. దానిచేఁ
గుపితమనస్కుఁడై యితడు కోలుమసంగెను సైన్య మెల్లఁ, గో
పపరివృతాత్మ లౌజనులు పాపముఁ బున్నెముఁ జూడ నేర్తురే.

కృపా॥ అవును. నీ వనినదియు యథార్థమే (పరికించి) రాజా! భీమార్జును లెక్కడ?

ధర్మ॥ (సంశయముతో) పుత్రశోకాతుర యగుపాంచాలి నూరార్ప గురుపుత్రునిపై కరిగిరి.

కృపా॥ (కొంచెము కోపముతో)

గీ॥ అందఱకుసభ్యమంటిమనర్హాకృతులు, గణన చేసినినిందుసౌభాగ్యతను లెవరు
నీ వెఱుంగవొసంగతి నేనెఱుఁగనో, భారతమెబొంకుగాదె యోపార్థివేంద్ర

ధర్మ॥ (తనలో) ద్రోణుని మృతికై నాయొనరించిన దుష్కృత్యము సగ్గడించుచున్నాఁడే!(ప్రకాశము) అవును, సత్యమే. నాకుగురుపుత్రునిఁ బరాభవించుట యంత యిష్టమే లేదు, మన కర్మమున కతఁడేమి యొనర్చును. మీరు భీముని కోపమెఱుఁగనివారు కారుగదా! అతని వెంటఁ గృష్ణార్జునుల నేదో యొకవిధమునసంధి గావింతురని పంపితిని.

కృపా॥ రాజా! మంచిపని చేసితివి నీకు సర్వవిధముల వృద్ధి యగుఁగాక.

చ॥ మిగిలినవార మేని యిది మేలది కీడని చెప్పికొంచు వై
పగతికి నక్కజంపడుచు వందురువారల కొండొకళ్లు కాం
తి గలుగఁ జేసి కొంచు సుగతిన్ గనుమార్గము చూచుకొక యీ
పగ లివి యేల? మీరవఁగఁ బార్థివ! మే మున నేఁటివారమే.

క॥ మీరని కొమరుం డనియును. నారయఁ డొక్కింత భేద మాదేశకుఁ డా
ధీరు మొగ మైనఁ జూచి వి, చారించితి మంచిత్రోవ సారాచారా.

ద్రౌప॥ అయ్యో! పట్టరానిశోకమ్మున మారుతిం బ్రేరేపితి దీన నేమి యుపద్రవము సంఘటిల్లునో, దైవమా? ఇప్పుడిఁక నేమి చేసినను నాకొమరులు లేచిరారు కదా!

కృపా॥ (తనలో) ఆహా! యీమె యెంతయోగ్యురాలో కదా! ఇట్టిసమయమ్మునఁ గూడ వంశద్రోహి పట్ల నిట్లు పశ్చాత్తాపపడుచున్నది (ప్రకాశము) అమంగళము శాంతించుఁ గాక. కృతసంధులై యరుదెంతురుగాక.

(అంతఁ గృష్ణ భీమార్జునులు ప్రవేశింతురు)

భీమ॥ పాంచాలరాజపుత్రి! ఇదుగో, యాతని శిరోరత్నము. నీప్రతిన నెఱవేర్చుకొనుము.

ద్రౌప॥ (పుచ్చుకొని) దీనికేమి యమ్మహాత్ముఁడు నాకొమరులవలెఁ దల్లీ! దుఃఖదాయి కాలేదు కదా!

కృష్ణ॥ వ్యాసాములయనుగ్రహమునం బట్టి యా ద్రోణానినివృక్షపాతమునం బట్టి యు నిప్పటికి మీయత్తగారును నా పెయ్యు ధన్యురాండ్రే.

ధర్మ॥ (సంశయముతో) అర్జునా! బ్రహ్మశిరంబు ప్రయోగించెనా రేమి?

అర్జు॥ అన్నగారిపలుకులం గనలి మొట్ట మొదటనే యాతఁడు దాని నుపయోగించెను

తే॥గీ॥ గగనమల్లనుమంటలఁ గప్పిపుచ్చు, నమ్మహాస్త్రమ్ముచే నెవరడ్డుపడుట
యతనితండ్రియె యస్త్రమైయుపహరించి, మనలఁ గాపాడె లేకున్న మనము మనము

ధర్మ॥ అమ్మహాత్ముఁ దలంచుకొన్న నాకెవ్వరిచావుకన్న దుఃఖము వొడమెడుఁ జుమీ

చ॥ కొమరునికన్న నెక్కుడుగఁ గూర్పుతలంపున విద్యచెప్పె సా
ధ్యమయిన పట్టుఁ దా మనలఁ దాఁకకయే బవరంబొనర్చె రా
జ్యము మనకీఁ దలంచి తనచావున కేనియు నొప్పె నిట్టియు
త్తముఁడు తటస్థమానె? యికఁ దమ్ముఁడ? జన్మము లెన్నియెత్తినన్.

అర్జు॥ ఒక్క యీయనయే యేమి? నీకో,

చ॥ కృపుఁ డనునామ మీయనకె కేవలముం దగుఁ గాక యాలమం
దెపు డెవరిన్ వధించె నటులే కనుపట్టె, దసాధ్యమైన శా
హులపటిమ గల్గి యీతఁ డిటు లూరక యుండుట చూడ నస్మదీ
యపరిభవాన కొప్పమి యె యౌఁ జుమి కారణ మెన్నిభంగులన్.

కృపా॥ నీ వనినట్లే సాధ్యమైనంతవఱకు సంచరించినను దుట్టతుద కీఘోరకృత్యము నందు నేనుగూడ నుండ వలసివచ్చెఁ గదా! యని విచారించుచున్నాఁడను.

ధర్మ॥ గురువర్యా! ఇవి యేటిమాటలు?

ఉ॥ ఉండక తీరునే! యొరులయొద్దఁ దగన్ గొలువుండి యందులో
ఖండన మాచరింపుమనిఁ బట్టిచరించెడునప్డు, శత్రులన్
గండడఁగించుటన్న సరిగా నగునే? యొకవేళఁ గొన్నియు
ద్దండపుఁ గార్యముల్ వలసి తప్పని వయ్యెడుఁ దప్పు మార్గముల్.

ద్రౌప॥ ఇంతకు నెవరికర్మమున కెవరు కర్తలు? ఎప్పుడో యిట్టిదుఃఖము నితరులకుఁ గలిగించితిని, ఇప్పు డనుభవించుచున్నాను. ఒకరా యిద్దఱా, అయిదుగురు కొమరులు పోయి రాయివలె జీవించియున్నదానను.

ధర్మ॥ ఆశ్చర్యమేమి? నూఱుగురు కొమరులు పోయినగాంధారి జీవించి యుండ లేదా!

కృష్ణ॥ ఇఁక నిట్లున్నకొలఁదిని దుఃఖ మతిశయించుచునే యుండును. రెండు త్వరగా స్నానము లాచరింపుఁడు.

క॥ పరలోకగతులకొఱకై, వ్వారు నింటన్ దాన మూడ వలదు తటినికై
యరిగి యటఁ గ్రుంకు లిడుటయు. మరియాద సమస్తధర్మమార్గములందున్

కృపా॥ అది యట్లే, నీవెఱుఁగని ధర్మము లేవి గలవు?

ధర్మ॥ (తనలో) అక్కటా! నాకుఁ బెదతండ్రిపోలికయే వచ్చెనుగదా! దైవమా!

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బగు పాండవాశ్వమేధమ్మునఁ

బ్రథమాంకము.





# పాండవాశ్వమేధము.

(ద్వితీయాంకము)

---

(అంత గాంధారీ ధృతరాష్ట్రులు విదురసహితముగాఁ బ్రవేశింతురు.)

ధృత॥ దేవీ! యూఱడిల్లు మూఱడిల్లుము.

ఉ॥ ఏకుటిలాత్ము లొజ్జ కెపు డెగ్గు ఘటింతురొ యేరు పెద్దలన్
గైకొని యేలరో సకలకష్టములుం దుది వారి కబ్బు, లో
కైకహితమ్ముగా నడచునట్టిమహాత్ములు సౌఖ్యభాక్కు. లీ
శోక మి దేల? దైవగతి చోద్యమొ! శోకము కార్యకారియే.

గాంధా॥(దుఃఖముతో) అయ్యో లక్ష్మణకుమారా! నీవైనబ్రతుకవైతివిగదరా! నాయనా?

ధృత॥ తండ్రీ! యింత జరుగు నని యెఱింగితి నేని నిన్ను రణరంగమునకే పోనీకపోదును గదరా!

విదు॥ దేవి నోదార్చుటకు బదులు తామును గూఁడ నజ్ఞానమునఁ బడెద రేమి?

ఉ॥ ఇయ్యెడ శోక మందు ఫల మేమి? సమస్తము మున్నెఱుంగమే?
కయ్యము సౌఖ్య మిచ్చుటయుఁ గల్గునె? యాయభిమన్యుఁ డిట్లనే
యయ్యకు నమ్మకుం గడుపునం దనలం బిడఁడే? జగమ్ములో
నియ్యెడ నిట్టిశోకముల నెవ్వరు కుందనివారు? పార్థివా.

ధృత॥ (కనులుదుడిచికొని) నాయనా! దుర్యోధన!

చ॥ కడుపు దవానలంబు గఁ బొకారెడిఁ గన్నులు మున్నె కానరా
వడలెడిమాకు నేమి గతి యంచుఁ దలంచితి వయ్యొ? నూర్వురన్
గొడుకులఁగన్నయాకు నొకకొడ్కును జేతికి నూఁత లేక పో
యెడినె? విధాత నీయెడల నింత వహించునె? పక్షపాతమున్.

గాంధా॥ తండ్రీ! దుశ్శాసనా! నిన్ను నేనెట్లు మఱచి పోదు నోయి!

విదు॥ (తనలో) ఎంత కష్ట మొంతకష్టము. వీరికేమి చెప్పి యూఱడిల్లఁ జేయఁగలను. ఇట్టికష్టము శత్రువులకేని లేక పోవుఁగాక (ప్రకాశము) అమ్మా! వధూనికా!

ఉ॥ శత్రుల నాజి నోర్చి పెలుచన్ జగమంత యు నాక్రమించి నీ
పుత్రుడు లేరి యేలి సుదిఁబోయిరి సూనావరంగముం, దిగే
క్షత్రియు లైనవారలకు సమ్మత, మేడువ నేల? ద్రౌపదీ
పుత్రులు వోరె? జ్ఞాతులకుఁ బోరిత మూరక యిట్లు కల్గెనే.

ధృత॥ (కొంచెము సంతోషముతో) సురనందనుఁడు మాత్రము తుదకు మంచిపనిచేసి నాఁడు సుమీ తమ్ముఁడా! ఇంతపని కర్ణుఁ డేని యుఁ జేయలేదని యేనా తాత్పర్యము.

విదు॥ (తనలో) ఇప్పటికిని నితని క్రీదుర్బుద్ధి వదల లేదు. అయినను నిప్పుడేమియు మన మనఁగూడదు. (ప్రకాశము) ఏమంత శ్లాఘ్యమైనపని చేయలేదు. ఈ యకార్యమునకు నీవంటిజ్ఞానవంతులు సంతోషించు టుచితము గాదు. ఇంత యెందుకు? అతనికి బాసటగానున్న కృపాచార్యులే యిందులకు సంతోషింప లేదుగదా! ఈసంగతి యాయన చెప్పినమాటలవలన నీకు స్పష్టపడియే యుండును. "సర్వేజనా స్సుఖినోభవంతు,, అందఱును సుఖముగా నుండవలెనని యెవరుకోరుదురో వారికి భగవంతుఁడు శుభముల నొడఁగూర్చును.

గాంధా॥ అమ్మా! దుస్సలా! మామూలమున నీకు వైధవ్యము తటస్థించినది కదా

ధృత॥ ఓహో! పుత్రశోక మెంత తీవ్రమైనది! తండ్రీ! దుర్యోధన!

ఉ॥ అల్లుఁడు పోయిన ప్పుడు త్వదాత్మజుఁ డీల్గినయప్పు డెల్లరా
ట్పుల్లజు లేగినప్పుడు నెదం గుదియించితిఁ గర్ణుపోకకున్
దల్లడ మంతగాఁ గొననిధైర్య మదెక్కడఁ బోయె నేఁడు నీ
త్రెళ్ళినవార్త వింటిఁ గడతేఱితిఁ జచ్చితిఁ బో పాకాలితిన్.

గాంధా॥ అయ్యో! అయ్యో! (మూర్ఛిల్లును.)

విదు॥ (తనలో) అహా! పతివ్రతాశిరోమణీ! నీకడుపున నెంతటిదుండగులు పుట్టిరి! (ప్రకాశము) అమ్మా! గాంధారరాజపుత్రీ!

ఉ॥ కన్నులు లేనిభర్తదశఁ గాంచఁ గదమ్మ? యతండు నీదు దుః
ఖోన్నతిఁజేసి ప్రాణముల నూడ్చెడి, సౌఖ్యము నెంచి కష్టముల్

పన్నిన ఘాతికై యడలఁ బాడి యటమ్మ! ద్వయమ్ము తుల్యమే
యన్న బుధోక్తులం దలఁపవమ్మ! పురాకృత మీడఁ బోవునే.

గాంధా॥ (మూర్ఛదెలిసి) అయ్యో! భీముఁ డెంతదుష్కృత్యము చేసినాఁడు.

ధృత॥ దేవీ! మనబంగారము మంచిదైనఁ గంసాలి యేమిచేయును?

ఉ॥ "మాయ దురోదరం బుడుగుమా," యననో "దుష్పదాత్మజాత న
న్యాయము సేయఁ గాఁ దగదు రా," యననో "వెసఁ బాలు పంచి యీ
దాయలతోడఁ గూడఁ దగదా," యననో వినఁ డాయె నింతకుఁ
బాయనిమంచిచెడ్డలవి పల్కులఁ దీఱునె? యింత సేయవే.

(కొంచెముకోపముతో)

తే॥గీ॥ స్యాలకుండవై కొంపను గూలద్రోచి, తాత్మజుల మేనమామవై యడఁచివైచి
తీవు చేరినఫల మిప్పు డింత లేట, తెల్ల మాయె వృథా మాట దీరు లవరు.

విదు॥ అన్నయ్యా! యేమియీవెఱ్ఱి, శకుని యేమిచేయును? దైవగతి యిట్లున్నది.

గాంధా॥ అయ్యో! తమ్ముఁడా! నీ వెందుంటివోయి?

ధృత॥ (తనలో) ఓహో! ఇది యీమెకు మఱింతదుఃఖహేతువైనదే! (ప్రకాశము)
దేవీ! శోకావేశమున నోడలెఱుఁగక యట్లంటివి సే కాని మతఁ డేమి కర్ణుఁ
డేమి యెల్లప్పుడును మన బాగునకే ప్రయత్నించిరి. అయిననేమి? మనమిరువు
రమును దురదృష్టవంతులము.

తే॥గీ॥ ఎన్నఁడో పెట్టిపుట్టితిమిన్ని బాము, లనుభవించుచునున్నార మవియె యిపుడు
కాదుకూడదటన్నఁ బోఁబోదుసుమ్ము, ఎవఁడుఁ చేసినకర్మమ్ము నెవఁడుగుడుచు

విదు॥ (తనలో) ఇట్టిసమయమున నితని నేమియుననరాదు గాని. ఐనను (ప్రకాశము)
అన్నయ్యా! మొదటి నుండి యు మీ కీభ్రాంతియే యింత తెచ్చినది,

చ॥ శకుని యుఁ గర్ణుఁడుఁ సలుపుసంగతులం దొకఁడేని మీరు లె
క్కకుఁ గనఁ జేయుఁడీ సుకృతకార్యము, వీరలపొత్తుఁ జేసి కొం
పకుఁ గలిగెన్ వినాశనము, పార్థివ సత్తమ! యెందు బాలనా
యకము నశింప కుండునె? పృథాగ్రజాముల్ తుది ముప్పావర్పవే.

ధృత॥ అవును. తమ్ముఁడా! ఇది యంతయు నాలోపమే.

చ॥ పాఁడిఁ జెవి నిల్లుఁ గట్టుకొని పోరితి వేనును దేవియుం దురో
దర మది యాడి గాఁ బ్రతిపదమ్మును జెప్పితి మింత వంత సు

స్థిర మయి యుండఁ బోలుఁ జెవిఁ జేర్పక పోరె నొకింత యేని యు

క్కురుకులపాంసనుండు. కడకున్ మముఁ ద్రోచె విచారనీరధిన్

(యోచించి)

తే॥గీ॥ అంతరించినవంశంబు నడఁగ నీక, మనపితామహి కెందు కీమమత పుట్టఁ

గావలయుఁ గావలయునన్ని కానిపనులు కావలయు దాని నాఁగఁ గాఁగలరె యొరులు

(అంత వ్యాసులు ప్రవేశించుచు.)

వ్యాస॥ (తనలో) అయ్యో! ఎంతకష్టమెంతకష్టము. కొడుకుంగోడలి నేమొగము

తోఁజూతును? అక్కటా! నావంశమున కెంత ముప్పు మూఁడినది. ఛీ! అజ్ఞాన

ము నన్నుఁగూడ నావరించుచున్నదే.

ఉ॥ గీతలు సూత్రముల్ దగ లగించితి మేటి విరక్తి నందిలో

కాతిగమైన జ్ఞానమున కాస్పదమైతిని నన్నుఁ గూడ నీ

జ్ఞాతివధానలమ్ము పెలుచన్ గరఁగింపఁగఁ జొచ్చె నక్కటా!

రాతికి నేనిఁ దప్పదు భరమ్మగుదుఃఖము చేత నున్నచో.

(విదురునితో) (ప్రకాశము) ఓహో యింతజరిగినదా?

విదు॥ మహాత్మా! వీరిదుఃఖమ్ము నాఁపనావశము గాకున్నయది తామివ్వారిం దేర్చి

యనుగ్రహింపవలయు.

ధృత॥ (తనలో) ఏమీ నాతండ్రి యగుసాత్యవతేయుఁడా! (ప్రకాశము) దేవీ!

యూఱడిల్లుము.

వ్యాస॥ అంబికేయా! ఏమి నీయజ్ఞానము?

తే॥గీ॥ ఎవ్వరేనియుఁ జేసెడిదేమిగలదు? పాండుమరణంబు విని నేను బ్రతుక లేదె?

దానినటులుంచు భీష్మవంతటిసహోద, కుంభయోనియు నిటులొంటి నుండవలసె

గాంధా॥ అయ్యో! అయ్యో! యెంత పాపాత్మురాల నైతిని. ఒకకొడుకు నేనియు

మిగుల్ప నైతివిరా నాయనా భీమన్నా!

విదు॥ అమ్మా! గాంధారరాజపుత్రీ! వ్యాసభగవానులు వచ్చినారు. ఇఁక మనకు

దుఃఖోపశాంతి కలుగును. శోకముమాని వారిదివ్యోపదేశములను విందము

ధృత॥ తండ్రీ! సాత్యవతేయ!

చ॥ జగమఖిలమ్ము నోర్చు జయశాలి భృగూద్వహు నాఁగెఁ దండ్రిచేఁ

దెగనివరమ్ము గైకొనియు ధీరుఁడు భీష్ముఁడు ద్రెళ్ళ నేల? యే

వగ నతఁ డంపళయ్యాపయి వందురుచుండెనొ వంశవృద్ధి ని
ట్టిగతిఁ దెచ్చుకూళలకు దెప్పర మేఁ యిఁక నేను నాసుతుల్.

వ్యాసు॥ తనయా! అటులనవలదు.

చ॥ తనకులమెల్లఁ బోవునని తా మునుమున్న యెఱుంగుఁ గాన నా
యనుజాఁడు స్వేచ్ఛజీవి యగు నైనను జూడఁగలేక యాడినే
పని నెఱవేర్చి కొండొక నెపమ్మున నిట్లొనరించెఁ గానిచో
మన మెటులోర్వఁ జెప్పుమ? కుమార! కుమారులచావు చూడఁగన్.

అదియునుంగాక.

చ॥ అతనియనుజ్ఞఁ గైకొనియె యట్లొనరించిరి వారు, కానిచో
బ్రతుకఁ దరంబె? కృష్ణు నొక బాలుఁగఁ జూడని భీష్ముఁ డుండు నే
నతలకు నేని, నీకొమరు లైఖరు లింతకు నింత దెచ్చె, దు
ర్మతు లుదయించు వంశములు మాయవె? పెద్దలు బుద్ధిహీనులే.

విదు॥ "బుద్ధిః కర్మానుసారిణీ" ఇంతకు నిది యిట్లు కాక తప్పదు.

చ॥ ఇరువురఁ జేలు గోరుజగ దీశ్వరుఁడు భీష్మునికన్న, వంశపుం
గురువగుద్రోణునకన్న నఁగూడదు గాని యొకుల్ వలంతులే?
యెఱిఁగియు నాపయిం దురము నేమని తా సరిపెట్టఁడయ్యె న
క్కురుపతి, సర్వనాశనము గోరకయుండిన నింత సేయునే॥

వ్యాసు॥ మనమిప్పు డేమనుకొన్న నేమిలాభము.

చ॥ జరుగవె పెక్కుయుద్ధములు, చావరె పల్వురు, పూర్వకాల మె
వ్వరికిని నిట్టిసంగరము వచ్చినయట్లును నిట్టిదుర్మృతుల్
దొరఁగినయట్లును న్వినము, దోర్బల ముండిన నుండుఁగాక యొం
డొరులు నశింతురే? కడుపులోకట్టుఁ గాలినవన్న దస్మృతై॥

ధృత॥ అయ్యో దైవమా? సర్వసముఁడ వగునీ కీపక్షపాత మెందుకు.

ఉ॥ ఐదుగు రైదుగు ర్గలిగి యట్లున యుండిరి సోదరాత్మజుల్,
నాదుసుతుల్ శతంబును వినాశము నందిరి యిందు నొక్కఁడున్
న్నిదయకన్ దగం డె? యవినీతి యొకింతయు లేదె? వారియం,
దేఁ దగువాఁడనే? దినము నీవయి వారిడఁ బొట్టకూటికిన్

గాంధా॥ అందుకును భీముఁడొప్పికొనఁడు, ఇంతవెఱ్ఱియెందుకు? కొడుకులకన్నను
మనుమలకన్నను మన కీ మేనులు త్యజింపరానివా?

ధృత॥ చక్కఁగా నుడివితివి.

ఉ॥ ఇంతకుఁ బూర్తిగాఁ జనర, యేగుచునుందురు వారినాకపుం
బ్రాంతమునందుఁ గూర్చెడియుపాయము మేను పరిత్యజించుటే
యింతయు లేనిదుఃఖముల నార్తివహించుట కన్నఁ జచ్చుటే
శాంతి, మఱెందు నింత కుపశాంతులు గల్గవు గల్గ వెమ్మెయిన్.

ఎవరురా యక్కడ! మాకుఁ జితఁ బేర్పింపుము.

వ్యాసు॥ కుమారా! యేమినీయవివేకము.

ఉ॥ చచ్చినవారితోడఁ బడి చత్తుమె? యాత్మవిఘాతుకత్వముల్
దెచ్చునె? సద్గతిన్, వలదె? తేఁకువ యార్యులనేవలేదె? యు
ద్యచ్చరితుండు ధర్మజుఁడు తండ్రికి నెక్కుడు నిన్నుఁజూడఁడే?
నొచ్చుకొనండె? నీగతి గనుంగొని, వేఱొకచూపు చూచునే.

క॥ మీయన్న కుఱుఁడు విద్యుల, నాయాసముగాఁ బతంచినట్టిఁడు బాల
ప్రాయమున మృతింగన నే, నాయుర్దాయమున నుండనా? గనుఁగొనుమా

ధృత॥ తండ్రీ! నే నెవ్వరిం జూచికొని బ్రతుకుదు?

చ॥ ఒకకొడుకేని యుండెనని యుందునొ? మన్మలకోస ముందునో?
యకట? యమంగళాస్పదులైన మొగంబులతోడ నేడ్చుకొం
డికతనపున్ వధూమణులు నిండినసంసృతిఁ జూడనేర్చుటే
సుకరము? చావుమేలొ? తగఁజూచి వచింపుము నాకు విమ్మెయిన్.

వ్యాసు॥ నాయనా! విదురునివల్ల సమస్తధర్మములు విని యున్న నీకు నేనిప్పుడు క్రొ
త్తగాఁ జెప్పవలసిన దేముండును?

చ॥ ఎవరినిఁ జూడ నేమిటికి? నెవ్వరి కెవ్వరు? మాలసంత, కా
లవశమునన్ జనుర్మరణలక్షణముల్ జను లొందుచుందు రి
య్యవి గనకే నిరంతరము నాత్మ తిరుండయి యుండు జ్ఞానముం
దవులనివార లియ్యెడ వృథా విలపించెద రింతయేటికిన్.

విదు॥ సంశయమేమి? జననమరణప్రవాహాభూయిష్ఠ మగు నీ సంసారమునఁ బ్రాజ్ఞు
లంతగా మమత గూర్పంజనదు. అన్నయ్యా!

ఉ॥ ఎందఱికీవు తండ్రివో మఱెందఱికిం దనుజుండవో మఱిం
గొందల మంద నేల? కనుఁగొమ్ము విచారణ సేయు మయ్య యో!
తుందుడుకింత చెల్లునె బుధుండవు గావె యెఱుంగవే ధృతిన్
జెందుము చిత్తవృత్తి నిటు చిందఱవందఱఁ జేయ న్యాయమే.

ధృత॥ తమ్ముఁడా! యిది యంతయు నిట్టిదే.

ఉ॥ ఇప్పటి కెన్ని జన్మముల నెత్తితిమో యిఁక నెన్ని యున్నవో
యెప్పటి కప్పుడే మఱచి యీగతి వందురుచుందు, మేటికిన్
దప్పదు కష్టముల్ సుఖము, తాఁకినఁ దూఁగుచు నుండు, దైవమున్
ముప్పున నిట్టి బాధ నను బోఁటికి ధాత విధించి యుంచు నే.

వ్యాసు॥ అదియే యజ్ఞానము.

ఉ॥ ధాత యెవండు? సేయుటకుఁ, దక్కుఁ డెవ్వరు? ప్రాక్కృతంపుఁ గ
ర్మాతిశయమ్మునన్ గలుగు నన్నియుఁ, దానినిఁ దాఁటఁ జాలఁడా
ధాతయు వానితాతయును, దప్పక తత్ఫల మంది తీరు బే
చూతువు కాని వేఱొకటి చూడము చూడఁగ నేర రన్యులున్.

గాంధా॥ అయ్యో! నాదుర్దశవంటిదుర్దశ విననదియు వినఁబోవునదియుఁ గూడఁ గాదు
దైవమా! దైవమా! యెంతదుర్గతి తెచ్చితివి!

వ్యాసు॥ గాంధారరాజపుత్త్రీ! విచారింపకుము.

చ॥ కొడుకులు పుట్టలేద యనుకొన్నకులాంగనఁ గళంకు నించున
క్కొడుకులు కొడుకులే? నయము కొంకక చెప్పితి చెప్పఁ జేసి తె
క్కడుగ, వినండ నీకొడుకు కూళతనంబున, నింతకున్ జగం
బడఁచుతలంపుతో నుదయమందె నిశంకు పతివ్రతామణీ

ధృత॥ అయ్యో! దైవమా!

చ॥ మనమునఁ బాపమాఱఁ గడమా లోకమా ఆ తనూజులన్ గనుం
గొనుటకుఁ గన్నులేనిఁ దుఃఖం! దయ సేయవుగా? మఱెంత యోఁ
పిన నది యేమొ దుఃఖమది పెద్దగుచున్నది, యీ పెకొఁకనున్
గనుఁ గొనఁ జాల నిందుఁ బ్రతికారము గన్పడ దేమి సేయుదున్

వ్యాసు॥ దంపతులారా! మీకట్టియభిప్రాయమున్న చోఁ జూడుఁడు శ్రీకృష్ణుం డ
య్యెడల దృష్టిని మీకుఁ బ్రసాదింపఁగలఁడు

విదు॥ ఇఁక నాలస్య మెందులకు? ఇమ్మహాత్ముని వచనం బమోఘము. ధర్మజాదులతోఁ గృష్ణుం డీపాటికి నయ్యెడకు వచ్చుచుండవచ్చును. మనముగూడ నయ్యెడకుఁ దక్కుంగలజనులతో నరిగి యొకసారి చూచి యుచితక్రియలు నిర్వర్తించు టయే కర్తవ్యము (నిష్క్రమింతురు)

(అంతఁ బాండవులు కృష్ణసహితముగాఁ బ్రవేశింతురు)

ధర్మ॥ కృష్ణా! వాసుదేవ!

క॥ ఏ మొగమునఁ గనుఁగొందును, మీమాట మెంతదక్క ముదితోఁ కుక్కల
దుఃఖామయమగ్నుల నకటా? యేమాడ్కిన్ వీరిదుఃఖమిది చల్లాఱున్

కృష్ణ॥ బావా! మీశాంతమునకుఁ దగినఫలము గలుగనప్పుడు మీరేమి చేసెదరు?

భీమ॥ (కోపముతో) ఓహో! యేమి యీవిరుద్ధము?

ఉ॥ వచ్చినవాఁడు చావక వెసన్ గురుపుత్రునిఁ బిల్చి యాతనిన్
మచ్చికఁ జేసి ద్రోవదికుమారులఁ దక్కన రాజసైన్యమున్
బొచ్చెముమై వధింపుటకుఁ బుచ్చినదుర్మదు నింక నొక్కమా
టెచ్చటనైనఁ జంపవలదే? యటుగామిని గోప మాఱునే.

ధర్మ॥ భీమన్నా! "మరణాంతాని వైరాణి" యనుట యెఱింగియు నీక నెందుకో యీ కోపము?

భీమ॥ అన్నయ్యా! ఈశాస్త్రయుక్తులు లోకమునకేగాని యీదురాత్మున కుపచరింపవు. ఏమంటిరా?

చ॥ మరణముతోఁ జడఁ దీఱుమరు మంచిప్రవర్తన గల్గువారు, దు
శ్చరితులు వచ్చియున్ బగఁ బిశాచములై కనఁజేతు రిట్టియ
ద్ధురచరితమ్ము గల్గుటనె దుష్టచతుష్టయ మున్నయట్టియీ
బిరుదు సుయోధనాదులకె పేర్కొనఁగాఁబడెడిన్ జగమ్మునన్

ధర్మ॥ తమ్ముఁడా! ఇదిసమయముగాదు, శాంతింపుము. (కృష్ణునివంక దిరిగి) వాసుదేవా!

తే॥గీ॥ తగుదునని యే మొగమ్ముతోఁ దెగనివగలఁ, బొగులుతలిదండ్రులఁ గనఁ
బోదునయ్యా, ఇంతకష్టము దోపలేదెపుడు నాకు. నాఁడు వనవాసమప్పుడైనను
మహాత్మ!

భీమ॥ (కోపముతో) అన్నయ్యా! మీరు మొదటనుండియు (అనునర్ధోక్తిగా)

అర్జు॥ (వారించి)

చ॥ ఒకరి నొకళ్లు చూచు టది యొక్కటి తప్పనికార్య మాటవే
నకట! యిటుల్ చనన్ దలఁచె నంతియ కాని ఘటోత్కచుండు నా
దుకొడుకు ద్రౌపదేయులును దోఁపఁగఁ జేసెశివంతకన్న దు
ష్టకుటిలబుద్ధు లాత్మజు లెవండ్రఁ బగుల్తురె? తండ్రిగారికిన్.

కృష్ణ॥ అజాతశత్రూ! మహారాజ!

ఉ॥ సామము చెప్పి చూచితిమి సంధికిఁ జొన్పితి మెందు కేని గా
సోదరి యొక్కటన్ హితవు చూపఁడ, కార్యము లేక యింత సం
గ్రామము చేయఁబూనితిమి కాలము చెల్లినవారు పోయిరి
బోవుమనదోష మేమి? యనపాయులకున్ సకలంబు దెల్ల మే,

నకు॥ దేవా! జగన్నాథ!

క॥ మన మొగము చూచు టెట్టులని, జనకుఁడు శంకింపవలయు సంధికిఁ దాఁబూ
నినఁ గాకపోవునే? యా, యనదోషము కాదె? కులము నడుగంటించెన్

సహ॥ బావా! దేవకీపుత్ర!

క॥ తల నెరసినంత నే పెద్దలె! తానొక్కండఁబూని తనతమ్ముని పు
త్రులమైనమాకుఁ బాలీ దలఁచినఁ బోకున్న యిదియుఁదగదే! తనకున్

ధర్మ॥ అన్నలార! యెందు కీగతజలసేతుబంధనము, ఎటువంటియార్యులకును నొ
క్కొక్క సమయంబుల బుద్ధులు తప్పత్రోవలం బడియెడి.

చ॥ వనమున ద్వాదశాబ్దముల వాసము సల్పితి మాఁగదా, సుఖం
బును గనకుంటిమే? యపుడు, పోరొనరించి జయించి రాజ్యముం
గొనుటయ కాని లేరుకొడుకుల్, మఱియెవ్వరికోస? మిప్పుడే
మనుకొన నేమిలాభ మగు? నన్నియు నింతకుఁ దీఱెఁబూర్తిగన్.

భీము॥ అన్నయ్యా! అట్లనెద రేమి? కొడుకులే కావలయునా? మనుమలుదినఁగూడదా?

ధర్మ॥ అక్కటా! యెంత వెఱ్ఱివాఁడవోయి?

ఉ॥ దుర్భగుఁడైన ద్రోణిశరదుస్సహతాపముచేతఁ గ్రాఁగుటన్
గర్భమునందె చచ్చియును గంజదళాక్షునను గ్రహమ్ము పై
నర్భకుఁ డిట్టులో యుదయ మందెడి నుత్తర, కాతఁ డిమ్మహీ
ధూర్భృతి సల్పవాఁడనుచుఁ దోషము వొందుదమయ్య! తమ్ముఁడా!

ఉ॥ పేరును బెంపునన్ వెలయఁ బెట్టెడువాఁ డభిమన్యుఁడున్ మహా
శూరులు ద్రౌపదేయులును సోమునివంశము వృద్ధి సేయఁగా
నేరనియప్పుడీనసువు నేర్పునటంచుఁ దలంచుటెట్లు? సం
సారమునందుఁ గోర్కె లొనసాఁగినవారలు లేరు తమ్ముఁడా!

పరిశీలించి చూచినచో నిప్పటిమనసంసారమునకన్న నేదియేనియు సుఖకరమే.

ఉ॥ పిల్లనిమోముఁ జూచి పొరి బెగ్గిలి యుత్తర యేడ్చు, నా పెనాం
పెల్ల నశించెఁగా యనుచు నేడ్చు సుభద్ర గృహాంబికెట్లు నో
ర్చిల్లెడి? నేస్తు లిట్లనుభవింపఁగలారె? సుఖమ్ము, లంతయున్
జెల్లినమీఁద రాజ్యమును జేయుటకన్నను దోస ముండునే?

కృష్ణు॥ (దృష్టినిగుడ్చి) ధర్మనందనా! అదుగో, విదురధృతరాష్ట్రులిటువచ్చుచున్నా
రు. మనము వారి కెదురేగవలయును. (పరిక్రమింతురు)

(విదుర ధృతరాష్ట్రులు ప్రవేశింతురు)

విదు॥ అన్నయ్యా ఆదేపాలికలను. దగ్గఱకు వచ్చినారము. ధైర్యమవలంబించి బంధు
గులం గనుఁగొందువుగాక.

ధృత॥ తమ్ముఁడా! యింతకన్న ధైర్య మేముండును?

తే॥గీ॥ అందఱుఁ గుమారులును బోయినట్టివార్త, వినియు నీగతినుండె జీవనముతోడ
నృతుఁడొ! లేక రాయినో! వీఁడు, మనుజ, జన్మమేయైననిది యెట్లు సంభవించు

ధర్మ॥ (దగ్గఱకరిగి) తండ్రీ!

ఉ॥ జూదరి జ్ఞాతిఘాతుకుఁడు శత్రుఁడు శీతక గాన్వవాయవి
చ్ఛేది యజాతశత్రుఁడను చెల్లని పేరు వహించువాఁడు నీ
మోదము నెల్ల వాటిపినమూర్ఖుఁడు కష్టుఁడు వీఁడె నేఁడు నీ
పాదయుగమ్ము నెంత్రిక్కడిఁ గృపన్ గని తప్పులనెల్ల సైఁపవే.

ధృత॥ (కౌఁగిలించుకొని) నాయనా! ఇఁదు నీతప్పేమున్నది?

శా॥ ఏమీ శ్లేనియుఁ జాలు నంచు పౌరి నీ వంపింపఁగా లేదె? నీ
నేదీ? నేరము, దానిపై సుతులచే నిప్పింపఁగా లేని నా
దే దౌర్భాగ్యముగాక, నిన్ను సుఖిఁగా దీవించితిన్ దండ్రి! నీ
వే దిక్కౌమని నిన్నుఁ గూడఁ జెఱుప న్నెంతు నో పుత్రికా!

భీమ॥ (నమస్కరింపఁబోఁగాఁ గృష్ణుఁడు వారించును.)

ధృత॥ (ప్రేమతో) నాయనా! ధర్మనందన! భీమన్న యేడోయి?

కృష్ణు॥ (తనలో) అబ్బా! యెంతప్రీతియో; పాపము (ప్రకాశము) ఇదుగో (ఇనుప భీముని ముందటికిఁ ద్రోయును.)

ధృత॥ (తనలో)

చ॥ కొడుకుల నెల్లఁ జెట్టి నిడుకొన్న దురాత్ముఁడు వీనిఁ జంపి నా
యొడలు కొకకొంత తీర్చుకొను టొప్పదె యింతకు వీఁడు పాపి పెం
పొడ గద నగ్గజేసి తలఁ ద్రొక్కఁడె? తత్ఫలమెల్ల వీని ని
ప్పుడ గుడిపించెదన్ దుదను బొంది మదాత్మజుఁ డుబ్బునట్లుగన్.

(ప్రకాశము)

ఉ॥ ఏలకుమార! కొంకు గొన నేటికిఁ దప్పొనరించి నాసుతుల్
కాలము చేసి రెవ్వరికిఁ గానివి కష్టసుఖమ్ము, లందులోఁ
గాలము చేరు వైనపుడు కల్మషపుణ్యముల్ లావహిల్లు నా
పాలిటి కీవె పుత్రుడవు పల్వురు గల్గిన నేమి లాభమా.

(కౌఁగిలించుకొని నలిపివేయును.) (అందఱును నాశ్చర్యము సూచింతురు.)

కృష్ణు॥ (ఎకసక్కెముగా) మామా! కురుకులగరిష్ఠ!

వ॥ నిజ మగు భీముఁడే యనాయు నీమదిఁ గల్గినకోపమెల్ల న
క్కజముగఁ జూపి యినుము పొడిగా నొనరించితి నీమనంబు ధ
ర్మజునిఁబోలె నాకెఱుఁగ గానిది గాదుసుమా? యెఱింగి నీ
గజిబిజి మాన్పఁగా నిటులు కల్పన చేసితి నినుపభీమునిన్

ధృత॥ (వెలవెలఁబోవుచుఁ దనలో) అయ్యో? దుఃఖములోనవమానముగూడఁ దటస్థించెఁ గదా! ఇఁక నేమి చేయుదును? ఇందుపాయ మేమి?

అర్జు॥ (తనలో)

క॥ పదివేలేనుగులబలము, న్నది యాతని కంచు నంద ఱాడుట విని యు, య్యది
యతిశయోక్తి యని నా, మది నెంతు నిఁకఁ బవాఁడు మహిలోఁ గలఁడే.

నకు॥ (తనలో)

క॥ ఇతఁడే రాజగురు సంగ్రా, మతలమున కువచ్చె నేని మన మొక లెక్కా..
చతురుదధిపరీతం బగు, క్షితియెల్లను నొక్క డైనఁ జేపట్టిదు న్నే.

సహ॥ (తనలో)

గీ॥ అన్నకన్నను బలవంతు లవనిలేర, యనుచుననుకొంటినితనియుండాతఁడెంత
పూర్వకాలపువారి కీపురుషులకును, నింతభేదమ్ముగల్గుట యిప్రుడు తెలిసె.

భీము॥ (సంరంభముతో)

ఉ॥ భీముఁడ నీకుమారకులఁ బెక్కురఁ జంపినవాఁడ ఘోరసం
గ్రామములోన నీకొడుకురక్తము గ్రోలినవాఁడ నిన్ను దు
ర్ధీమహితున్ మదగ్రజుని ప్రేరణఁ జేసి పరామృశింపఁగా
నీమెయి వచ్చినాఁడ నిపు డింతయుఁ జూచినవాఁడ నీకృతిన్.

ధర్మ॥ (నిర్వేదముతో) తమ్ముఁడా! కాటికిఁ గాళ్ళు చాచుకొన్న కులవృద్ధులతో మన కీయధికప్రసంగ మెందుకోయి?

భీము॥ ఇప్పుడును నన్నే మందలింప వలయునా?

తే॥గీ॥ వృద్ధుఁ డంటివి సత్యమే యెందుకీను, రాగ్రహము వృద్ధలక్షణమందు వేమొ
పరమచండాలుఁడితఁ డెట్టివాఁడరేని, నిజమువధ్యుఁడు వధ్యుండు నీవెఱుఁగవు.

ధర్మ॥ తమ్ముఁడా నామాట విని యంతతోఁ జాలింపుము.

క॥ సుతశోకజ్వరమున సం, ప్రతిపన్నం బయ్యె సన్నిపాత మితని కి
ట్టితఱిన్ బొనర్పుపని దు,ష్కృతమో సుకృతమొ తెలియు నేరో గులకున్

కృష్ణ॥ మామా! అంబికేయ!

గీ॥ కొడుకులా! లేరువారలకొడుకు లేని, లేరువీరలనెల్ల బల్మి నివధించి, యపయశము
నొందుటయె తక్కనక్క టకట! యెవరికిచ్చెదు రాజ్యమ్ము నెఱుఁగఁ జెపుమ

భీము॥ ఎవరి కెందు కీవలెను! తానే పరిపాలింపఁ గలఁడు. చేఁతకాదా యేమి? భగవంతుఁ డిటుఁగి గుడ్డివానిఁ గాఁ జేయఁ బట్టి గాని లేనిచోఁ బ్రపంచ మంతయు మ్రింగక పోవునా?

ధర్మ॥ భీమన్నా! యిఁక నీవితనిం గుఱించి మాటాడితి వేని పాండునృపాలునియడుగులకుఁ దప్పినవాఁడవు ఏనో చెప్పఁదగిన సంగతి బావ చెప్పుచున్నాఁడు చాలదా?

కృష్ణ॥ మామా! సత్యవతీపౌత్ర!

క॥ తనకడు పొక్కటియనుచు, మ్మనికడుపొక్కటియు నే? సమున్నతమగువ
ర్తన గల్గునుత్తములకే, మన నేరుతు? మింతకన్న నధికముగ నిసున్.

విదు॥ వాసుదేవా! మహానుభావ!

చ॥ ఎఱుఁగనివాఁడు గాఁడు "పరమేశ్వరు నంశమ వీ", వటంచు, నీ
యరయుట వీరికిం గల దటంచు నెఱుంగనివాఁడు గాఁడు స
త్వరమున భీముఁ బంపుటకుఁ బాల్పడి మేటియజ్ఞ చేసె సా
దరమతిఁ జూచి యెట్లయినఁ దప్పు క్షమింపఁగదయ్య మాధవా!

ధృత॥ దేవా! వసుదేవనందన!

చ॥ సుతులను జంపె వీఁ డనెడిశోకభరం బది దేవ మెల్ల వ్యా
పృత మయి కాఁగి రాఁగి యొక పెట్టున బగ్గున మండి యిట్టి దు
ష్కృతిని వివేకమున్ విడిచి చేయఁగఁ బూనితి సత్యమే కృపా
రతి ననుఁ బ్రోవఁగావలె శరణ్యుని నిన్ శరణంటి మాధవా!

ఉ॥ మామను! బిడ్డవాఁడను నమస్కృతి చేసెద నన్ను దాన నీ
సేమము వోవు నంచు మది చెల్లదు దేవుఁడ వయ్య నీవు మా
భూమిని బుట్టి దుష్టతికమున్ మనుఁబోటులతోడఁ గల్పి చే
సూ! మనిట్టిసంశయము చొప్పడఁ జేసెదు హేతు, వల్లుఁడా!

కృష్ణు॥ మామా! నీవు నిజముగా నపరాధివయ్యును బశ్చాత్తప్తుండవై నిర్దోషి వైతివి.
(చేత ధర్మజు నిర్దేశించి)

మ॥ ఎమటన్ జెప్పఁగరాదు గాని యితఁడీ పృథ్వీభరం బోక్కటా!
త్రిదివం బేనియు నేలఁగాఁ దగినవరిష్ఠుండు, కృష్ణుండు నొ
క్కండగున్ వాఁడనుకోకు మీతఁడు జగత్కల్యాణశీలుండు నొ
క్కండగున్ వాఁడును మాకు నెల్లగను, నిక్కం బిట్టిఁ డొం డుండునే.

విదు॥ కృష్ణా! మహానుభావ!

ఉ॥ నీచరితం బ దిట్టి దని నిర్ణయ మెవ్వఁడు సేయనేర్చుఁ గా
నీ చతురబ్ధివేష్టితమహీవలయమ్మున ధర్మసూతి కే
రాచకుమారులున్ సవతు రా రనువా టది నిక్కవంబు సం
కోచము లేదు లోకమునకున్ గుణ వీతఁడ శీలసంపదన్.

కృష్ణు॥ సంశయ మేమిఁ యొకశీలముననే కాదుం. సర్వవిధములచేతను, నితని కొరు
లు సాటిగారు. మామా! కురుకులజ్యేష్ఠ!

ఉ॥ అట్టియితండు నీయెడ మహాదరమున్ గడుభక్తియుం గలం
డెట్టియెడన్ సహోదరులు నీతనియాజ్ఞకుఁ గట్టుదప్ప రీ

విట్టికుమారు లుండియును నెందుకు దుఃఖము నొందె? దయ్యయో!
చెట్టలునూర్వు రుండిన విశేషమె యిట్టిఁ డొకండు చాలఁడే!

ధృత॥ కృష్ణా! దేవకీనందన!

ఉ॥ ఈ వనినట్లు ధర్మసుతుఁ డిట్టిఁడ, బుద్ధి జనించె నాకు నీ
సేవకతమ్మునన్ మును పు చేసినపాపము లెల్లఁ బోనెఁ గా
నీ వగ పింకనున్ మనము నీఱుగ జేయుచు నున్న దయ్య! యో
దేవ! మహానుభావ! యిది తీర్పఁగ వేఁడితి నిన్ను మాటికిన్.

నిన్నొక్కసారి కన్నులారఁ జూచినం గాని నా కీదుఃఖ ముపశమింపదు.

ఉ॥ నిన్నొకసారిఁ జూచితిని ముద్దులు మూటలు గట్టఁ జాలునీ
యున్నవగింపు, దాని నిపు డారయఁ జేయు మిఁకొక్కసార, యే
జన్మములన్ దపమ్ములను సాఁగనిసౌఖ్యము దానఁ గల్గనం
చున్నది లోనఁ గోర్కి, దయ యుంచుము భక్తపరా! పరాత్పరా!

కృష్ణు॥ (తనలో) పాపము కొడుకుల నంతటిం గడసారి జూచుటకై కాఁబోలు నిట్లు
కోరుచున్నాఁడు. (ప్రకాశము)

తే॥గీ॥ కనఁగోనును నేఁడునీపుత్రగణము నెల్ల, రాజబంధులతోఁ గూడ, రమణితోడ
నిచ్చితిని దృష్టి, పోలికలనిదుగో, చూడు, మా! యొకించుక మూరానమాన వేంద్ర

ధృత॥ (కలయుంజూచి) నాయనా! యొక్కసారి దగ్గఱగాఁదీసికొనిపోయి చూపిం
పుము.

కృష్ణు॥ ఇదుగో, ఇటురమ్ము. (అంధుని బరిక్రమింతురు)

ధృత॥ (చూచి)

చ॥ విఱిగిన తేరులా! యివి, భువిన్ బడిపోయిన గొరుబాగులా!
సురిఁగినసూరులా! యకట! మాడఁగఁ జాల జనార్దనా! మహా
భర మనిపించుచున్నది, కృపన్ మరలింపఁ గదన్న దృష్టి, యే
పతమును మంద భాగ్యుఁ డగువానికి మోదము, గూర్పఁజాలునే!

(తెరలో)

శా॥ కోదండైకగురుండు తండ్రి, యనగ్రజుల్ పెద్దతండ్రుల్ పితృ
వ్యాదుల్, నీర లటుండఁ గేవలము లోకాధ్యుండు జీవం బిడం

గా దక్షుండగు మేనమామ, రిపుచక్రం బెట్లు నిన్ జంపె నా
దౌర్భాగ్యము కాక నీకు రిపులన్నా? గడ్డిపోచల్ గదా!

కృష్ణ॥ (విని) బావా! సుభద్ర కాఁబోలును దుఃఖించుచు నిట వచ్చుచున్నది. నీవు పోయి యూరార్చి వెనుకకుఁ బంపుము.

నకు॥ (నిష్క్రమించును) (మరలఁదెరలో)

చ॥ అన్న ప్రతిజ్ఞ తీర్పఁ బూటకునై చనియే బ్రతిమాలుకొందు నా
పన్నశరణ్యుఁ డాతఁడు కృపన్ "బలిభిక్షు" మటన్న "లేదు పో"
మ్మన్నను "గాదు కూడ" దని యప్పటి కెట్టులో "యొప్పఁ జెప్పగా
నన్నరు" నంటి నాపలుకు నాటకపోయె నిఁకేమి సేయుదున్.

ధర్మ॥ (విని) అర్జునా! దుస్సల కాఁబోలును. నీవేపోయి యామె నోదార్పుము.

అర్జు॥ (నిష్క్రమించును) (మరలఁదెరలో)

ఉ॥ పేరును బెంపునన్ వెలయు పెద్దలు ద్రోణుఁడు మున్నగాఁగ న
వ్వీరులు కౌరవేశ్వరుని ప్రేరణ కారణమై యహో! దురా
చార మటంచెఱింగియు నసాధ్యు నినుఁ బోరిఁజుట్టిముట్టిరే?
వేతను దీర్చి రే మనుభవించిరి? వా, రపకీర్తి దక్కెనన్.

ధృత॥ పాపము. ఉత్తర కాఁబోలును. అయ్యో! దైవమా! యెక్కడఁ జూచినను రోదనధ్వని తప్ప రెండవధ్వని వినఁ బడదు కదా!

ధర్మ॥ తమ్ముఁడా! నీ వరిగి యామె నోదార్పుము.

సహ॥ (నిష్క్రమించును) (మరలఁదెరలో)

ఉ॥ ఒక్కరొయిద్దఱో శతము నొక్కమొగిన్ బలియిచ్చి భీముఁడన్
దెక్కలిశక్తి, కెక్కరిణిఁ దీవ్రపుశోకముఁ బట్టనేర్తు న
మ్మక్క! యిదేమి దారుణమొ ప్రాణము పోవదు పొమ్మటన్న, నే
నక్కలురాను నాదరికి నందను మెక్కుచు నున్న వక్కటా!

క॥ కొడుకా! యంతటి రాజ్యము, విడిచి జనకు విడిచి నన్ను విడిచి యనుజు
లన్, గొడుకులను దోడ రాన, ట్టడవిని నిలు గట్టి కొంటివటరా! తండ్రీ!

ధర్మ॥ (విని) తమ్ముఁడా! ఆపెపరమపూజ్యురాలగు గాంధారరాజపుత్రి. మనకుఁ బెద్దతల్లి, ఆమెకుఁగోపోపశాంతిఁ గా వేఁడికొని యామె యనుగ్రహమున్ బడయుట కిట్లు ప్రార్థింపుము.

ఉ॥ అమ్మరో! నీదుపుత్రకుల నందఱఁ జంపితి ధర్మమో యధ
ర్మమో రణమ్మునం, దనపరాధిగఁ జూచి కృపారసాభిషే
క మొనరించుచూడ్కులను గాంచఁగదమ్మ భవత్పదాంబుజా
తమ్ములు దక్క నిష్కృతిపథ మ్మిఁక లేదు గదమ్మ! యెమ్మెయిన్

భీము॥ (వెళ్ళఁబోవును.)

కృష్ణ॥ బావా! మాట. (రహస్యముగా) ఆమె నిన్నిట్లనం గలదు.

గీ॥ పోరుదురుగాక రిపులఁ జంపుదురుగాక, రాజ్యమును గొంద్రుగా కెందు రాజవరులు
రక్తమును గ్రోలినట్టులే రాజ్యమందు, నున్న వింటిమే? యోరోరి! మూర్ఖతముఁడ
ఇందుకు నీవిట్లుత్తరమిమ్ము.

చ॥ పరమపతివ్రతన్ ద్రుపదుపట్టినిఁ బట్టి భవత్సుతుండు ను
త్కరమున వల్వ లొల్చుతఱిఁ గట్టినయట్టిప్రతిజ్ఞకై నిజా
ధర మొకయింత రక్తమునఁ దడ్పితి నంతియ కాని యంత త
ప్పెఱుఁగనివాఁడ నమ్మ? మది యేవము సైఁచు నటమ్మ నమ్ముమా.

భీము॥ (నిష్క్రమించును.) (తెరలో)

క॥ రారాజపై యశేషధ, రారమణులు గొల్చునిన్ను గ్రద్దలు చుట్టుం
జేరెనె ధర్మజునకు ముద, మారెనె? నీదగునవస్థ మాఱెనె? తనయా!

ధృత॥ కృష్ణా! నీవొసంగినదృష్టి మాదంపతుల కెంత యుపకారమగుచున్నదో
యీ తండ్రి!

ధర్మ॥ (తెరవంక జూచి) అమ్మా! గాంధారరాజపుత్రీ!

క॥ నీకొడుకులఁ జంపించితి, నాకొడుకులఁ జంపుకొంటి నయహీనుఁడ దు
ర్ధీకుఁడఁ బాపాత్ముఁడ శో, చ్యాకారుఁడ నాకు శాప మర్పింపఁ దగున్.

ధృత॥ తండ్రీ! నిష్కలుషుండ వగు నీకు శాప మెందు కీవలయు?

విదు॥

తే॥ ధర్మమకదా యుధముచేఁ గెలధర్మమూని, గుణమకద యంచు నద్దానగుణము గూర్చి
తంతియే కానినీవేరి కాహవమున, నపకృతి యొనర్చి యెఱుఁగవయ్యయ్యో రాజ!

(తెరలో) కృష్ణా! కురువంశ కృష్ణవర్త్మ!

ఉ॥ కూఁకటివ్రేళ్ళతోడఁ గురుకోటికురుట్పటలిన్ విలార్చితీ
వే కుటిలాత్మ! జ్ఞాతులకు నింతలు పుట్టునె లేకయున్న, లే

వే? కలహామ్మ లెయ్యెడను, నీయనురంతయు నిన్ను నట్లనే
తాఁ జెఱుపఁజేయు నిది తప్పదు నేనొకసాధ్వి నైనచోఁ,

కృష్ణు॥ (లేనిసంతోషముతో) అత్తా! నీవునాకుశాపమిచ్చిననునది యనుగ్రహముగానే పరిణమించినది సుమీ!

ఉ॥ యాదవు లేరికిన్ సమరమం దవిజేయులు చచ్చు టెట్లొకో
యాదురహంకృతుల్ భువిని నేగతిఁ దీఱునొకో భరం బటం
చేఁ దలపోతు నీకొడుకులే యనుకొంటిని నీవుఁ గూడ నా
పై దయఁ జూపి భూభరము వాపితి వంతియ చాలు నెమ్మయిన్.

ధర్మ॥ బావా! పాండవులవలనఁగదా మీవంశమునకుఁగూడ నిట్టియాపత్తు ఘటించుచున్నది, అయ్యో! పుణ్యమునకుఁ బోయినఁబాప మెదు రగుట యిదియే కాఁబోలును.

గీ॥ ఎన్నివిధముల సంధిని యియ్యకొల్పి తెంతకష్టించితివిపోయె నదియు నెల్ల
నక్కటా! యాపెయొక్కంత యరయదయ్యె, సైఁపఁగదవయ్య మాతల్లి సాహసంబు

కృష్ణు॥ ధర్మనందనా! నీకింత నిర్వేద మెందుకు! ఇది యీమె శాపంబువలననే కాఁదగినదికాదు. మున్నిట్టియాదవులకు బ్రాహ్మణ శాపంబున్నది. అది యట్లుండ.

క॥ ఎందులకు నేనియుమనుజం, కందగుఁ జావునకు జంకఁగా రా దది తా
నందుట యొక్కపరియె యగుఁ, గుందఁగ నేమిటికి దీనికోస మ్మనఘా.

విదు॥ దేవా! మహానుభావ! అజ్ఞులకుఁ గాని యిప్పట్లు భవాదృశులకు దుఃఖ మెక్కడిది? ఆపెయేనియు సమస్తధర్మము లెఱిఁగినదైయైనను నెందులకో యిప్పట్లు తొందరపడినది. ఇంతకును నీ వనినట్లు.

తే॥గీ॥ ఇతర మగుశాపమిచ్చిన నించుకంత, జంకఁగావలెఁగాని యీశాపమునకు
జంకఁబని లేదు చావకశాశ్వతమ్ము, గానిలుచువారలంచు జగానఁగలరె.

ధృత॥ దేవా! జగన్నాథ! మాతప్పు లన్నియు క్షమించి మమ్ము మన్నింపుము.

కృష్ణు॥ ఇందెవరితప్పును లేదు. ఏది యెట్లు జరుగునో అట్లు కాక మానదు. మనము నిమిత్తమాత్రులుగా నుండకతీరదు.

(తెరలో బెద్దరోదనధ్వనులు.)

విదు॥ (విని) అమ్మో! అంతఃపురజను లందఱును నొక్కపెట్టఁ దమతమబంధుజనం

బులకు విలపించుచు నిటువచ్చుచున్నారు. మన మీపాటి వీరల నందఱిని నోదార్చి యుచితక్రియలు జరుపవలెను బోవుదము

కృష్ణు॥ ఇఁక నిట్లున్న కాలఁడని దుఃఖమతిశయించుచునే యుండును గావున నట్లొనరించుటయే మంచిది. (అందఱునునిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బగు పాండవాశ్వమేధమ్మున

ద్వితీయాంకము.





# పాండవాశ్వమేధము.

(తృతీయాంకము.)

(నారదుఁడు ప్రవేశించును)

నార॥ ఓహో! నేఁటిదినమున ధర్మజునిపట్టాభిషేక మహోత్సవమఁట. అటకరిగెదను అయ్యెడ శ్రీకృష్ణదర్శనము సైతము గలుగును. కానఁ దీర్థమును స్వార్థమును గూడగలసివచ్చును. (పరిక్రమించి) ఏమీ? యీ బ్రాహ్మణు లందఱును గుంపులు గుంపులుగా నేమేమో చెప్పుకొనుచుఁ బోవుచున్నారు. "విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నము" లన్నట్టు లేదేని యంతరాయము రాలేదు కదా? (దివ్యదృష్టిం జూచి) నే ననుకొన్నట్లే జరిగినదే! పాపము!

క॥ ఇంతదనుక దాఁచినయా, కుంతికి నేమంత వచ్చెఁ గొడుకని కర్ణున్
మంతనము విడిచి చెప్పర, యంతేనియు సిగ్గు వలదె? యాఁడుది గాదే.

ఇంతకు నామె యేమిచేయును? కర్ణలోపమునకు శంకించి నొడివి యుండును.
(కోపముతో)

గీ॥ ఎదుటనున్నను గోపించి యొగిరిమీఁదఁ, బడిశపించునుగాని మర్త్యాసులకట
కొంపతీఁతకుగాక తాఁగుంతికేల, యీయఁగావలెఁగన్నియ కిట్టివరము.

సరే ఆమె చేసినశుశ్రూషకుఁ బ్రతిఫలముగా నిచ్చియుండును. దానికేమి?

తే॥గీ॥ మూర్ఖుఁడేమంతయోగ్యుఁడు సుదతితన్నుఁ, బిలుమఁగాక వరమ్ముది
తెలిసికొనఁగ, వచ్చెఁబో! మునియాజ్ఞయవార్యమాటఁ, దప్పు క్షమియింప
మున్నప్పుడొప్పవలదె.

దీనికేమిగాని కర్ణుని మనోనిశ్చయముమాత్రము కొనియాడదగినది.

క॥ ఎఱుఁగును పాండుసుతులు సోదరులని, యట్లెఱిఁగి మనమునందించుకయున్
గరుణ జనియింపకుండ బ్రవరమున నరికట్టుటన్నఁ బ్రాపెఁగలదే!

ఇతఁడిట్టివాఁడు గనుకనే యనేకులు యోధవరులుండఁ "గర్ణునితల భారత" మను పేరితనికి వచ్చినది. సరే ఇంతకుమనము వచ్చినపని వాకిటనే కాలవేసి

నది. ఇఁక మరలిపోకెందుకు? (మరలి) పోనీ వచ్చినవాఁడను రానే వచ్చి నాను. ఒకసారి చూచి పోవుట మంచిది గదా (కొండొకపరిక్రమించి) అదుగో ధర్మజుండచటనే విచారముగాఁ బాంచాలీసహితముగ సోదరులతోఁ గూర్చున్నాఁడు. పోయి పాపమాతని నోదార్చెద.

(అంతఁ బాండవులు ద్రౌపదితోఁ బ్రవేశింతురు.)

ధర్మ॥ (అర్జునుంజూచి కోపముతో) అక్కటా! తల్లి యెంతపనిచేసినది! ఇఁక స్త్రీల కీరహస్యగోపనశక్తి లేకపోవుఁగాక. ఇది శాపమగుఁగాక (శాంతముతో) తమ్ముఁడా? ఆమెలోపముకన్నను నా తెలివితక్కువ యిక్కడ నెక్కుడనక తప్పదు.

ఉ॥ కుంతి మొగమ్ము తీరచటఁగొండొక గన్పడసంశయించి "యీ
వింత యిదేమి" యంచముగ వేమఱు నాలుక బాఱఁబోవ న
ల్లంతనె "భావ్యమౌనె యిది" యంచు మరల్చితిఁ గాని యాపెతో
మంతనమందుఁ బల్కిన సమస్తము నా కెఱిఁగింపకుండునే.

నార॥ దౌవారికా? మేమువచ్చితిమని చెప్పుము.

దౌవా॥ (ప్రవేశించి) జయము జయము నారదులవారు విచ్చేసిరి.

ధర్మ॥ ప్రవేశపెట్టుము.

దౌవా॥ స్వామీ? ఇటు దయచేయుఁడు (అందఱును లేతురు)

ధర్మ॥ బ్రహ్మపుత్రా? నమస్కారము. ఈయాసనము నధిష్ఠింపుఁడు.

(అందఱును గూర్చుందురు)

నార॥ అభీష్టావాప్తి ర్భూయాత్.

చ॥ హరికరుణావిశేషమున నర్జునుగాండివపాటవమ్మునన్
గరువలిపట్టిబాహుబలగర్వమునన్ రిపులన్ జయించి భూ
భరమడఁగించి రాజ్యమును బాలన సేయుచు నుంటివే? వసుం
ధరసుకృతమ్ము లిప్పటికిఁ దద్దయుఁ బండెనె? గోర్కి నిండెనే?

ధర్మ॥ (విచారముతో) దేవా! మహానుభావ!

ఉ॥ జ్ఞాతుల నెల్లఁ జంపి సిరి గైకొనినట్టియపాత్రు ధర్మసం
జాతుని మిమ్ము బోఁటి మునిసత్తము లింత ప్రశంస చేయఁగాఁ

జూతురె! తొల్లి వారలును సూతతనూజుని గాఁగ నాముస
ర్వాతిశయుండు సోదరుఁడె యౌనఁట! మాకిఁక నేమి సేయుదున్,

ఉ॥ తల్లి వచించె నాఁడు పితృతర్పణముల్ పచరించునప్పు "డా
సల్లలితుండు సూర్యునిప్రసాద" మటం చతఁడేము నైనచో
నెల్ల జగమ్ము లొక్కటయి యెత్తి పయిన్ బడెనేని లక్ష్యమా?
చెల్లెసమస్తమిప్పటికిఁ జేసెడిదేమి? మునీంద్రచంద్రమా!

భీము॥ (విషాదముతో)

ఉ॥ "నన్నుఁబరాభవింపఁ దగునాయకుఁ డెవ్వఁడు రా?" యటంచు నే
మున్ను మదొందు నేఁటికి సమూల మెఱింగితి నక్కటక్కటా!
యున్నరికంపుమాటలసముద్ధతిఁ జూపితిఁ బాపి నైతి నా
యన్న యటం చెఱుంగక మహాత్మ! కడుం జెడిపోతి నింతకున్

అర్జు॥ (విచారముతో)

చ॥ అతఁ డెదురైనయప్డు దని నక్కలు వేవురు దోఁచినట్లు నా
మతిఁ గనుపట్టి "శూద్రుఁ డనుమాటిది నిక్కవ మానొకో! యదే
యుత మగునేని యిట్టిధృతి యింతటిచే విటువంటిపౌరుషో
న్నతియు ఘటించునే?" యనుచు నామది నెంతు ననేకభంగులన్.

నకు॥ ఉ॥ ఎన్నఁడు నేరిఁ జూచి భయ మించుక యుం గని యే నెఱుంగ నా
కన్నరనాథుఁ జూచినపు డాత్మనదేమొ? భయోదయంబు మా
యన్న యజాతశత్రుఁ గనినప్పటికన్నను గొంత హెచ్చెడున్
మన్ననఁ జేసి తత్పదనమస్కృతి సేయఁగ బుద్ధి పుట్టెడున్.

సహ॥ క॥ అని నతని నప్పుడప్పుడు, "గని? యింతటి మేటికొల్వు గావించునె? యొ
క్కనిచెంత" యనుచు నామది, ననుకొంటిని, గాని యిట్టు లనుకొననైతిన్

ద్రౌప॥ అక్కటా! నాఁడు సభామధ్యమున నన్ను నెకసక్కెపుమాటల గేలిసేయు
నది యేమో! సుయోధనునియెడఁ గనలినమనమిమ్మహాత్ముని యెడ నంతగాఁగన
లకసమ్మతింగనఁ జేసెను. అయ్యో! అత్తగారు మీతోఁ జెప్పక పోయిన
నాతోడనైన నించుక జెప్పక పోయిరి గదా!

నార॥ అమ్మా! ద్రుపదరాజనందని!

ఉ॥ ఇంత యథాయి కత్యమది యెచ్చటఁ జూచి యెఱుంగఁ గారణం
బింతకు నిట్టు లుండ మఱి యెవ్వరు నేటికిఁ జెప్పఁగా వలెన్?
వంతఘు ప్రియమ్ముగా మిము నవశ్యము చెంద విధించె ధాత, యే
మంతన మిట్లు డాఁగె ననుమాటలు ము న్నెపుడేని వింటిమే?

క॥ తనకుఁ దనతండ్రి చెప్పఁడొ, జనని వచింపదొ యి దిట్టిసంగతి యని మం
తనమునఁగృష్ణుఁడు సెప్పఁడొ, వినఁజాలనె యతఁడు, మీకు వెఱ్ఱియు నేలా.

ధర్మ॥ మునీంద్రా! యెవరు చెప్పినను మాయన్నగారితోడ నేచెప్పిరి గాని మాకు నొక్కింత చెప్పక పోయిరి కదా! పోనిండు.

ఉ॥ ఎట్టి రహస్య మైన మదినించుక సేపు వహింప రేనిమీ
యట్టిమహానుభావులును నస్త్రదదృష్ట మదే మొ? నాఱుకన్
గట్టిగ బిగ్గఁ బట్టి మముఁ గాపురుషాగ్రణులం బొనర్చి య
ట్టిట్టన రానిదుఃఖమున కిక్కలఁ జేసితి రేమి పాపమో!

నార॥ (సంశయముతో) రాజా! యిప్పఁట్టున నేనుఁ గూడ వ్రతభంగం బొనర్చు నొన్న మాట సత్యమే ఏమంటివా! దానికిఁగారణము లేకపోలేదు.

క॥ కారణమెట్టులైనను భూ, భారహరణమునకె మున్న బ్రహ్మాదులు దా
మేరుపఱచి రిట విఘ్నము, నారదుఁ డొనరించె ననుచు నాపైఁ బడదే!

అప్పటికేనియు నేను దాఁచెడివాఁడను గాను గాని.

క॥ సనకాదులతో సరిగ, ద్దెను గూర్చుండఁదగువాఁడ దీనిని నే నే
మని నీతోఁ దగుదు నటం, చును జెప్పుదు ననుచు లజ్జ చొప్పడె ననఘా

ధర్మ॥ మునివర్యా! తమ రిప్పు డిట్లు తప్పుకొనుచున్నారు గాని నిజముగా మాయందుఁ దమ కనుగ్రహ మున్న యెడల,

తే॥గీ॥ అనయమునుమాకుశాత్రవుఁడైనయట్టి, యలసుయోధనుతోనైన నఁగల తెఱంగు
తాముగరుణించిచెప్పినదానిమీఁద, నతఁడుఖండనమున కేల యనుమతించు

(కర్ణునుద్దేశించి)

శా॥ అన్నా! నీవు గతించుమీద, భవదీయం బైనరాజ్యంబు నై
కొన్నన్ గొందును గాక న్యాయ్య మగుటన్, గుంతీమహాదేవి కూ
ర్జన్నీ కే మనుమున్న భార్య యగు పాంచాలిన్ గురుద్రోహియై
యిన్నీచుండు పరిగ్రహించె నకటా యీద్రోహముం బోవునే!

భీము॥ అన్నా! హరిదశ్వనందన

చ॥ "కురుపతి యంగరాజ్యమునకున్ నను( బట్టముగట్టె" నంచు సం
బరపడి తెవ్వ( డాత(డు? భవత్పరిపాల్యము కాదె? యర్థరా
జ్యరమయు, దీనిలోన లవ మైనను నుండునె? యంగభూమి, బం
గరు మసిపాత( గట్ట( బడె( గార్యము లే దిక నేమి సేయుదుర్?

అర్జు॥ అన్నా! లోకైకవీర!

క॥ "ఎనయొకగిరికొక రుకర్ణా, ర్జును" లనిజనులాడుకొనన సూయవడుచు "నా
కెనయౌనె? సూతసుతు(" డని, మనుపుమ! యాతప్పొకండు మన్నించినను.

సీ॥ "పాంచాలికాసతీపరిణయమ్మున నను నీతో( బోరి నిక్ బాఱ(దోలితి" నని
"యుత్తరగోగ్రహణోత్సవమ్మున నిన్ను మించి వెన్నంటి భంజించితి" నని
"సర్వముఖాస్త్రపరిహారంబు కృష్ణునిదయ( దప్పె లే కున్న( దప్పని" దని
"అసమయమ్మున(" బాడి యగు(గా(దనక బాణమేయకుండిన( దెగ(డితే(" డనియు

తే॥గీ॥ నొక్కొకప్పుడు మనమున నూహసేతు( నంతియేకాని నాజయమభిలషించి
"యీవుపేక్షించితి" వటంచు నెటులగ నైతి(, గ్రూరమతి నైతి( గృష్ణుండు కొంపదీసె

(కృష్ణుడు ప్రవేశించును)

కృష్ణు॥ అవును పాపము నేనే కాదు? కొంపతీసినది. మీయన్నతీయ లేదు కా(బో
లును. ఆవేళ నతనిచే నవమానింప( బడి నిన్నునునన్నును నేమనియెనో
జ్ఞప్తికి( దెచ్చికొనుము? ఇంతకును జీతమును బత్తెమును లేని మీకొలువు గొలి
చినందులకు నన్నిటు లనవలసినదే.

ధర్మ॥ ఇంతకు మా కర్మ మిట్లున్నప్పుడు నీ వేమి చేసెదవు?

ఉ॥ "సూతజు( జంప లే వయితి" "శూరు(డ" వంచు( బ్రగల్భపుక్ వచ
శ్చాతురి( జూప( గా( గలవె? చాలును గాండివ మింక నేల నీ
చేత ధరించెదో!" యనుచు( జిన్నెలు వన్నెలు పెట్టి తిట్టితిక్
బాలిశు నైతి ముక్కు తెగబారె(డు చేసితి నిక్క. మచ్యుతా!

భీము॥ సరే అందులకు మాత్ర మిత(డే కా(డా? నిమిత్తము.

ధర్మ॥ తమ్ము(డా! అత( డేమి చేయును? సంధి కరిగినప్పుడు మంతనమ్మున నమ్మహా
మహునితో( గల తెఱంగు వచియించెను గదా( అత( డొప్పనియప్పు డితని
తప్పేమున్నది?

భీమ॥ అంతలో నేమిలాభము?

ఉ॥ చెప్పెనె యన్న "తమ్ములను జేరుము నీ" వని, యంతమాత్రఁ దా
నొప్పెడివాఁడె కర్ణుఁడు, మఱొక్కరియట్టిఁడె! యన్నమాటకున్
దప్పునె? యాసుయోధనునిఁ దన్నెద నమ్మినవాని నూరకే
యొప్పరికించునంతటి యయోగ్యుఁడె? నీకెనఁ గాఁడె యన్నిటన్

నకు॥ బావా! నీకుఁ గోపము లేనిచో నేనొకటి మనవి చేసికొనుచున్నాఁడను.

చ॥ ఎఱుఁగనియిష్ట "మాతఁడె నే" యనుబుద్ధి సుయోధనున్ నిరం
తరము భజించి తత్కృపను దానొకరాజయి, "పార్థునోర్తు సం
గరమున" నంచుఁ బల్కు తఱి గల్గినయప్పు డెఱింగి తానయై
మఱలి మనున్ గనుంగొనెడి మాత్రమె? యాతని శౌర్య మల్పమే?

సహ॥ బావా! నీమనమున నిజముగాఁ గపటమే లేనియెడల మాతో నించుక చెప్ప వలసినది.

తే॥గీ॥ అట్లు చెప్పితి వేని మాయన్నగారు, కోరి బ్రతిమాలి రాధతోఁ గొంత చెప్పి
యొప్పఁగాఁ జేసి యీపక్షముండునటుల, సలిపి యాతని రాజుఁగా నిలుపకున్నె

ధర్మ॥ తమ్ముఁడా, అంతపని కెందుకోయి?

ఉ॥ అన్నగదా! మనందఱికి, నాతనిమాటకు నడ్డువారమే?
యున్నరుఁ డేనుఁ బావనియు నీరలుఁ. గృష్ణుఁ డొకింత చెప్పకే
కన్నులు మూసెఁ గాని "యలకౌరవనాథుఁడె నాకు సమ్మతుం"
డన్నను "మంచిదే" యనమె? యాతనిఁ గొల్చుట కొప్పకుందుమే?

ద్రౌప॥ అవును, మీరు "రాజ్యము వదలి యరణ్యమునకుఁ బదం" డనిన నెవరుచెప్ప నివా రమ్మహామహుఁడు "దుర్యోధనునికే రాజ్యం" మ్మన్న నట్లొనరించుటకు సందియ మేమి?

నార॥ (తనలో) వీరల నించుక కలహమును బెంచెదఁగాక. (ప్రకాశము) అవును. తక్కినవారిమాట కేమి గాని శ్రీకృష్ణులవారు మాత్రము కొంచెము సూచనయైనఁ జేయవలసినది.

కృష్ణ॥ (క్రోధహాసములతో) మహానుభావా! కలహాభోజన! యేమి యిట్లు సెలవిచ్చుచున్నారు!

ఉ॥ ఏనటు చెప్పఁబే నిజము యేనియు వీరలు సేసినట్టియ
న్న్యాయనములౌ ప్రతిజ్ఞలవి యొప్పునె? వీరలు సమ్మతించు టె
ట్లైనను, నూరువుల్ విఱుచుటా? రుధిరమ్ము మగ్రోలుటా? మృతుం గా
నొనరించుటా? యొకటి కావు గదా! మఱియేరి కిన్నియున్?

అర్జు॥ బావా! బలభద్రసోదర!

చ॥ ప్రతిన యనంగ శత్రువులపైఁ బ్రసరించును కాని యొయ్యెడన్
హితులకు నన్నదమ్ములకు నిట్లగునయ్యె? స్మరింపు! మమ్మహో
ద్ధతు వధియింపలేనినను ధర్మజుఁ డించుక దూఱ, నేనుఁ జి
న్నతనము చూప, నే మనుచుఁ నాఁడు వచించితి వీవు? మాధవా!

ద్రౌప॥ (కొంచెమునవ్వుతో) అన్నా! విన్న వారు వృథాగా నాడినమాటకు గాక చేసినట్టను దానను గాను గదా. ఇయ్యెడల నెఱిఁగియో యెఱుఁగకో నీయందు లోపము మాత్రము లేక పోలేదు. నీశక్తి యెవ్వ రెఱుఁగనిది?

నార॥ (తనలో) ఆయిన నేమిగాని చక్కఁగా నడిగినది. దీని కేమి యుత్తర మిచ్చునో?

కృష్ణ॥ (భారముగా) ఇంతకు "నేను కపటముగాఁ గర్ణునిఁ జంపించి నా" ననికదా! మీరందఱును నిందించుచున్నారు. సరే మంచియో చెడ్డయో యిందులకు నే నొప్పుకొన్నాఁడను గాని,

చ॥ అలయభిమన్యునిన్ ద్రుపదునాత్మజులన్ మఱి నీకుమాతులన్
గలన వధించువాఁ డితఁడు గాఁడు గదా! కపటమ్ము పన్ని, వా
రల బ్రతికించుకొం డవల రాధసుతున్ బ్రతికించి యేను నా
తల నిడినట్టితప్పిదము తప్పఁగఁ ద్రోసెద నింత నేటికిన్.

నార॥ ఎందులకేని నీవే సమర్థుండవు గాని వీరలవలన నేమగును?

ద్రౌప॥ మహాత్మా! చక్కఁగా సెలవిచ్చితిరి.

భీము॥ బావా! అభిమన్యునిమాటకు నేను చెప్పఁజాలను గాని తక్కినవారిమరణము నకు నీవు గాక మఱియెవ్వరు నిమిత్తము?

తే॥ గీ॥ మమ్ము నెద్దియు యొకనిమిత్తమ్ము సెప్పి, శిబిరమును బాపినట్టి విశిష్టదృష్టి
యూరకే కల్గె నేనీకుఁ, గారణమ్ము, నెఱిఁగియును చెప్పకుంటచే నింతపుట్టె

అర్జు॥ బావా! క్షమింపుము.

గీ॥ నీతోఁబుట్టువు పూర్ణగర్భవతియై స్నేఁ గాలమునఁ బద్మఁగం
జాతవ్యూహవిధమ్ము సెప్పనెడ, నాసాధ్వివతఁసమ్మ్రని
దానితైక్ష్ణమ్మునఁ గన్మొగుడ్ప. శిశు వంతస్థాయి యూఁకొట్టుచోఁ
గాతర్యమ్మున మధ్య వచ్చి యది విఘ్న మ్మొందఁగాఁ జేయవే?

నార॥ అవును. ఈసంగతి నేను స్వర్గమున నప్పుడప్పుడు విన్నదే. అతనికిఁ బద్మవ్యూహము చొచ్చుటయే కాని మరల వచ్చుటఁ దెలియమి "కిదే హేతు" వనిమాత్రియు పరివాద మొకటి లేకపోలేదు.

కృష్ణ॥ మహానుభావా! మీరుఁ గూడ నాయెడల నింత యనుగ్రహించుచున్నారేమి కొంచెము సందర్భాసందర్భములు విచారించ నక్కఱలేదా? ఊరకేఅని నంతలో నేమగును? గర్భములోనిశిశు వెక్కడ నేని యూఁకొట్టునా? యూఁకొట్టునేయనుఁడు దానిచే నాకుఁ గాతర్య మెందుకు? సరే అప్పుడు నేనువిఘ్నము చేసినచో మఱియొకప్పు డితఁడుతనకొమరున కాశేషమును బోధింపఁగూడదా?

నార॥ చిగురుసంగతికి నేనుత్తరముచెప్పఁజాలను గాని దానివెనుకసంగతికిఁ జెప్పఁగలను.

కృష్ణ॥ (తనలో) ఓహో! ఈయన నిష్కారణముగా నాపై లేనిపోనితుట్ట వేయుచున్నాఁడే! (ప్రకాశము) పోనీ దానికేని తగిన యుత్తరము సెలవిండు.

నార॥ ఎందుకా కాతర్యము, సంపూర్ణముగా విన్నచో నభిమన్యువు జయించు వారెవరును నుండరుగదా! అప్పుడతనికై మరల నీవే యవతరింప వలసివచ్చును. "గోళ్ళందీరెడిపనికి గొడ్డళ్ళెందుల" కని యట్లొనరించి యుండవచ్చును.

కృష్ణ॥ (నవ్వుచుఁగొంచెము కోపముతో) మునీంద్రా! మీరుమఱియుం జక్కఁగా సమర్థించుచున్నారే!

తే॥ గీ॥ లేక.లేకొక్క చెలియలా లేమకొక్కఁ, డేసుతుండఁట? యవ్వాని కితఁడు మేన
మామయఁట! వానివృద్ధికై మానసమునఁ, గనలునఁట! కంటిమే? యిట్టికట్టు
కథలు

నకు॥ బావా! క్షమింపుము.

క॥ నరకాసురుండు నీకుఁ గొ,మరుఁడేకద! యతనినీవుమడియింపవే? భూ
భరము నివారించెడినీ, కరయఁగఁ "బుత్రుఁడనిఁ శత్రు"వనియుంగలదే.

కృష్ణ॥ దుర్మార్గుఁడైనచో భూమికి భారముగలిగించుఁగాని సన్మార్గుఁ డట్లు చేయఁడు కదా! అభిమన్యునకును వలకునకును నెక్కుడిసాటి.

తే॥గీ॥ ఖరగుణుండైన పార్థునిపట్టి నాకు, మేనయల్లుండు సుగుణనిధాన మకట!
యుతనికతమునఁ బుడమి కే యడరుగల్గె నెవ్వరును నమ్మరీగాథ లింతనిజము.

నార॥ భవిష్యత్సందర్భము తెలిసిన నీతో మాటలాడఁ గల మాట కాని.

తే॥గీ॥ ఒక్కండెవ్వండో దక్క నీయుద్ధమందు, మఱియు రాజులు లోకసమ్మతులుగారె
వీరు భూభారకారులు గార యేని, యెందులకుఁ దెచ్చిపెట్టితి విట్టిరణము?

ధర్మ॥ (తనలో) ఓహో! యితరులకలహమును జూచి సంతసిల్లెడు నారదుఁడు స్వయముగ నే కలహమునకు దిగుచున్నాఁడే! (ప్రకాశము కృష్ణునివంక చూచి) కృష్ణా! వాసుదేవా!

ఉ॥ ఏవిషయమ్మునుఁ గూడ "నిది మిథ్య" మటంచు వచింప లేము గా
నీవిను మొక్కమాట, యెఱిఱేనియు గోచర మానునీకు. నే
లోవిదు లేని యిప్పలుకు గూడఁ దనం గలవారు కారు నీ
సేవకులైనపాండవుల సేగికి నెప్పుడు నొప్ప వచ్చు తా?

నార॥ రాజా! నీవు చివరను జెప్పినమాట సత్యమే. ఈతడు పాండవుల సేగి నెప్పుడును నొప్పలేదు.

కృష్ణ॥ (తనలో) ఓహో! వీరు విరమించినను నిమ్మని విరమింపక మరల నేదో రెట్టించుచున్నాఁడే! (ప్రకాశము) మునీంద్రా! బ్రహ్మమానసపుత్రా!

ఉ॥ ఏ నొక మర్త్యుఁడన్ సకల మెట్లు తెలింగెద మిమ్మువంటి ప్ర
జ్ఞానిధులైనసన్మునులసంగతి నించుక తెలింగి యున్న మా
టే నిజ, మైన నయ్యది విహింపఁబడ వైచుట తప్పు కాదె? క
ర్మాను గతుల్ మరల్పఁ దరమా? పరమాత్మకు నేని నారదా!

ధర్మ॥ ఇంతకును నతఁడు సెప్పినట్లు కర్మ మనివార్యము.

ఉ॥ కడచినదానికిన్ వగచి కార్యము లేదిఁక మీఁద నైన నీ
గొడవలు మాని పాపమునకున్ దగనిష్కృతి చేసి కొంచు న
ట్టడవిని మిమ్ముఁ బోలెడుమహాత్ములఁ గొల్చుచుఁ గాలశేష మి
ట్లుడుపఁ దలంచి రాజ్యమిది యొప్పఁగ జెప్పితి వాయుసూతికిన్

అర్జు॥ (తనలో) ఓహో! తిరిగియు నన్నగారు పూర్వపువైరాగ్యములోనికి దిగు

చున్నారే! ఇందు కేమి యుపాయము?

ద్రౌప॥ ఆయన మీతమ్ములు గారా? మీ కన్న యడవులాయనకు లేవా? తీరఁ దగుముచ్చట లన్నియు నిప్పటికి దీరినవి ఇఁక నిప్పు డరణ్యవాసమెందుకు? పోనిండు, అట్లౌనన్చిన మీయన్నగారు గాని తక్కినవారుగాని లేచి వచ్చెదరా?

నార॥ రాజా! ఆమెయుఁ బుట్టెడుదుఃఖములో నున్నది నీకై ధైర్య మవలంబించి యూఁదుది యైనను నిట్లు పలుకుచున్నది. ఆపలుకు విశ్వసించి.

తే॥గీ॥ శిష్టరక్షణమును దుష్టశిక్షణంబు, సల్పుమను లోకు లెల్లరు జయ మనంగ ధర్మ
రాజను పేరు సార్థకము గాఁగ, నేలుకొనుమయ్య? ధరణికి మేలుగాఁగ.

భీము॥ అన్నయ్యా! ఇందులకుఁ దామొప్పితిరా సరే, అట్లు కాదేని.

చ॥ కొడుకులొ కామ్యలొ యెవరికోసము రాజ్యము నాకుమాత్ర, మే
జడమతి నయ్యు మీకతన జ్ఞానము గొంచెము నేర్తు మీర లె
ర్యొడ వసియింతురో యచట నేనును మీపదసేవ సేయుచున్
గడ పెదఁ గాల మాజ్ఞ యిడఁగాఁ దగు నాకు ననుగ్రహమ్మునన్.

ధర్మ॥ (వినువుతో) తమ్ముఁడా! నేనొక్కటి చెప్పెద నాలింపుము.

గీ॥ ఆదినుండియు నాకు రాజ్యమునఁ గాంక్ష, యంతగా లేదు "నిజమిది" యనియొంటుంగు
దాని పైనిన్ని కష్టముల్ దాపరించి, "ఛీ" యనివిరక్తి వొడమెనా చేతమునకు.

అర్జు॥ (తనలో) ఈయన కెవరు బోధింపఁ గలరు? మొదల నుండియు నీయనయభిప్రాయ మిట్టిదియే (ప్రకాశము) అన్నా! ధర్మనందన!

క॥ ఇపుడీ వైరాగ్యమ్ము, నిపుడే యొనరింప రాదె? యాత్మజులును భూ
మిపతులు జ్ఞాతులు నీదగు, కృపను బ్రతికి పోదు రెటుఁగుఁగీర్తియు మనకున్.

ద్రౌప॥ సంశయ మేమి? అప్పుడే గట్టిగా నామనోనిశ్చయ మిట్టిదనిన నిం దొప్పనివారెవరు? ఇప్పుడి ట్లనిన నేమి లాభము? వారికిని లేదాయె మన కంతకన్న లేదాయె, ఇట్టివృథాప్రయాసమెందుకుఁ బడవలెను?

ధర్మ॥ ఎందుకా? ఇందుకు.

క॥ "అరులకు భయపడియాతం, డరణ్యములదిరుగు" ననెడియపయశమది నా
కు రుచించె నేనియును మీ,కు రుచింపమి నందు దిగిలఁ గూర్చుండ నైతిన్.

కృష్ణు॥ సరే, అట్లయినచో,

క॥ "ఇల నేల లేక కానన, ములకేగక ధర్మజుండు వెంగి" ననిరోసి ప
ల్కులు పైఁప లేరు నీతమ్ములు, వీరి ననుగ్రహింపు మనుపటివలెనే,

ద్రౌప॥ (తనలో) ఇప్పట్ల నన్న మంచిసమాధానము చెప్పినాఁడు.

భీము॥ అన్నయ్యా!

తే॥ గీ॥ శతువిరక్తిని నన్న కాఱడవి కేగఁ, దగినతమ్ములుగల్గియుఁ దగవు చెప్పి
మాన్పలేరై" రటంచుధీమంతులనెడి, పలుకులేగతి సహియించువారమయ్యా?

నార॥ (తనలో) కొంచెము త్రోవఁ జూపినచో ధర్మరాజునకుఁ దగినయుత్తరము చెప్పఁదగినవాఁడు భీముఁడే, ఈయంకుశము లేనిచో నామత్తగజమిదివఱకే యడవులం బడిపోవును.

నకు॥ అన్నా! కౌంతేయాగ్రజ!

క॥ రణ మన్నయప్పుడే మా, రణకర్మము గాదె? యది మారణమునకే కా
రణ మగును గాని సుఖకా, రణమగునే? దీనిచే విరాగము తగునే?

సహ॥ అన్నా! సకలధర్మవేది వగునీకొరులు చెప్పవలయునా?

తే॥గీ॥ నృపునకన్నయుఁదమ్ముఁడు నితరులునునధర్మవర్తులగుటఁ జదండ్యులెకద?
కర్ణుఁడు నధర్మవర్తి యౌకతనదండ్యుఁ, డయ్యెనియ్యెడసందియమంద నేల?

నార॥ (తనలో) చిన్నవాఁడైనను మంచిఖండితోత్తరముగాఁ జెప్పినాఁడు. భీమార్జునులు చెప్పినను నింతనిరాఘాటముగాఁ గనుపట్టదు. ఇంతకుఁ నితఁడు చెప్పినట్లు వారెట్లు చెప్పఁగలరు. ఏకగర్భజనితులుగదా. వీరికైదుగురకును నట్టిభేదము లేదు గాని, ఐనను ఆవేళ్ళి కావేళ్ళి లెక్కనియుఁ గొంచెముదూరము కాక పోవునా?

కృష్ణ॥ ఇప్పట్ల నితఁడు చెప్పినమాట కడుశ్లాఘాపాత్రముగా నున్నది. రాజులకు శత్రుమిత్రాదిభేదమెట్లు కుదురును. శాస్త్రమును బట్టిపోవలయును. లేదా నరకము సిద్ధము.

ధర్మ॥ (నిర్వేదముతో) ఏమీ? నేనా! అమ్మహాత్ముని శిక్షించువాఁడను.

ఉ॥ అక్కట! యిట్టు లాడఁ దగు నయ్యా? పరాక్రమశాలి దాతృతా
ధిక్కృతకల్పపాదపుఁడు దీనజనావనపక్షపాతి పే
రెక్కినవాఁడు "స్వామికృతి కింతటిసాహసి లేఁ" డటంచు, నే
నెక్కడ? యాతఁ డెక్కడ? యిసీ? జగ మిప్పని కుత్సహించునే.

అతఁడు విధేయుల మగు మాయెడల నట్లు నటించినను నది తప్పుకానేరదు. మీకుఁ దక్కనతఁ డెవ్వరి కేమి యుపకృతి చేసెను.

చ॥ ఎవనిభుజాబలమ్మునను యింద్రతనూజుని వాయుపుత్రునిన్
గవలను నిన్ను నన్నెదురఁగా గమకించె సుయోధనుండు, దా
నవనికి దానుఁడై మెలఁగె నీజగతీతల మెల్ల నేనియున్,
శివశివ! యమ్మహామహునిఁ జెప్పి మఱొక్కనిఁ జెప్పనున్నదే!

బావా! యింత యెందుకు! సంగరమున నొక్క యర్జునుం దక్క మమ్ము నలువురను నతఁ డవమానించుట నీ వెఱుంగనిది కాదు గదా! చేఁజిక్కినప్పుడు వదలిపెట్టుట కాతనినీతిధురంధరత్వము తప్పవేఱొండు కారణము చూపుము. నాకన్న నేకాదు. ఎవరికన్నను నతఁడు లోకోత్తరుఁడు, చక్కనిబుద్ధితోఁ బరికించిన నతనియెడ దోసము వీస మేనియు నుండదు. (నిర్వేదముతో) అయ్యో! దాతృత్వమా! నీవు దిక్కులేని దానవైతివి సుమీ!

నార॥ నిజమున కతఁ డట్టివాఁడే కానిదుర్యోధనునియొద్ద నుంటచే నతనియోగ్యత కనుపట్టినది గాదు. ఆశ్రయవిశేషమునం గదా! గుణములు శోభించవలయును. అందులో "దాతృత్వమతనితోఁ బోయినఁ" దన్ననది యతిశయోక్తిగాదు.

ఉ॥ ఆతనిదాతృతామహిమ మయ్యమరేంద్రుఁ డెఱుంగు "నిచ్చుచోఁ
జేతికి నెమ్మి లే" దనుప్రసిద్ధికి నీతఁడె తగ్గవాఁడు ప్ర
ఖ్యాతశరీరి కర్ణుఁ డిపు డైనను జావఁగ లేదు నిక్కమే దా
తృత దిక్కు లేని దయి తా నశియించెఁ జుమీ! యమాత్మజా.

క॥ బలిశిబిదధీచు లిల మును, గల రెక్కుడుదాత లందుఁ గర్ణునితోడన్.
దులఁదూఁగువార లిరువురె, బలికీతని దొరయుపాటి బలముంగలదే?

కృష్ణు॥ సంశయ మేమి? తమరు సెలవిచ్చినట్లే.

గీ॥ అర్థమీవచ్చుఁగాక సమస్తరాజ్య, మీయఁగావచ్చుఁగాక వెన్నెమ్ముమాంస
మీయఁగా శక్యమె చర్మ మేరికేని, నితనికే వారికే తగె నింతవట్టు.

ధర్మ॥ (కన్నీటితో)

ఉ॥ అట్టిమహానుభావుఁ డిలయంతయు నేలిన నేలుఁ గాక నా
యట్టిఁడు తాదృశుం డగునుదారునిరాజ్యముఁ బూని యేలినన్

దిట్టరే? పండితుల్, కవులు తిట్టరే? పేదలు తిట్టిపోయరే?
"వట్టి పిశాచి వీఁ" డనెదువా రెటు నే మొగఁగట్టి కొందునో?

కృష్ణ॥ బావా! నీ వాదాత్మృతియందును శాతనికిఁ దన్ముఁడవే సంశయ మేమి?

చ॥ వెనుకటిరాజసూయమున విప్రుల కెందఱి కెన్ని భంగులన్
దనిపితి చక్రవర్తివిగదా! యిపుడంతకు నెక్కుడైన చ
క్కనిసుకృతమ్ములన్ విరివిగా నొనరింపుము జ్ఞాతివర్గమం
దనజనితాఘసంహతు లణంపుము చింతిల నేల? దీనికిన్.

భీము॥ అన్నా! దండధరనందన!

చ॥ అమలవశీప నీవు ముద మారఁగఁ జేయఁ గదయ్య యశ్వమే
ధము, దురితమ్ము లెల్లను యథా యథలై నశియించు దాన, "ద్ర
వ్య మిపుడు లేదుగా" యని లవమ్మును సందియ మందఁ బోకు వి
క్రమ ధను లైన సోదరులకన్నను ద్రవ్య మొకండు కల్గునే.

నార॥ రాజా! మేము విధింపఁ దగినయంశమ్మును ధర్మజ్ఞుఁ డగునీతమ్ముఁడే బోధించుచున్నాఁడు. కావున నవశ్య మట్లొనరింతువు గాక.

అర్జు॥

తే॥గీ॥ ద్రవ్యమున కేమిసంపత్ప్రదాత్రియైన యంబుజాక్షుని దయ మనయందుఁగలదు
కామధేనువునట్టింటఁగట్టిపెట్టి "కోర్కెలొనఁగూర్పు" మనియొరుఁగోర నేల

నకు॥ (పౌరుషముతో) అన్నా! ధర్మనిదగ్రగణ్యా! అట్లిదో నివృత్తి యొనరించుకొను టుచితము, అంతియె కాని.

తే॥గీ॥ రాచపుట్టువుఁబుట్టియరణ్యసీమఁ, దిరుగుదురె? బ్రాహ్మణులమె విధించె ధాత
మనకు భూభారభరణ, మమ్మహితునాజ్ఞ, వన్నెసేయుట మీవంటివారికగునె?

సహ॥ అన్నా! కౌంతేయాగ్రజ! ఇదియేనియుఁ బ్రాయశ్చిత్తార్థము చేయ నక్కఱ లేదు. రాజులకు నవశ్యాచరణీయ మగుట నొనర్పఁదగినది.

తే॥గీ॥ జ్ఞాతులను మన మేటికిఁ జంపినారి? మంతరించిరి వా రెల్ల నాత్మదోష
ములకతమ్మున, నీవంటిపుడమిఱేఁడు, జాతిధర్మమ్ము విడిచిన జగముచెడదె?

ధర్మ॥ అన్నలార! యెంతేఁగీ యెఱుఁగనిమాటలు చెప్పకుఁడు కులవృద్ధగు భీష్ముఁడే మంత దోషియై యంతరించెను?

(అంతనొకపురుషుఁడుప్రవేశించును, "ఇదుగో" యని ఉత్తరమిచ్చును, పోవును)

ధర్మ॥ (విప్పిచూచి తనలో)

క॥ తమ్ముంగుఱ్ఱలఁ గృష్ణుని నమ్మినవరు సెట్టులేని యే గొప్పింపం
గమ్మది సెంచితిఁ గులగురు, విమ్మాడ్కి విధించెఁ బాత, యిఁక నేమందుక్

కృష్ణ॥ ఏ మిది రహస్యమా? మీలో మీరే యోజించుచున్నారు.

ధర్మ॥ (చేతి కిచ్చును.)

కృష్ణ॥ (చదువును)

క॥ శ్రీరస్తు చిరంజీవికి, పారాచారున కజాతశత్రునకు ముదం
బారఁగ శంతనుసుతుఁడా, శ్రీగాద్యంతముగ వ్రాయు సేమపువార్తల్.

ద్రౌప॥ (తనలో) ఏ మని వ్రాయునో!

భీమ॥ (తనలో) ప్రశ్రితాదుగుణముగా నున్నచోఁ జక్కఁగా నుండును.

అర్జు॥ (తనలో)

గీ॥ అకట! వాడు శరమ్ముల నంపసెజ్జఁ, గూలియుండి రణంబు తేఁ గోపమొంద
నిపుడు దీవించిరే వ్రాయునిద్ధచరితు లాంతి నా కెంతయో లజ్జాకరంబు.

నార॥ తరువాత

కృష్ణ॥ అరులజయించితి రాజ్యము, కరగతముగఁ జేసికొంటి కావున ధర్మస్ఫురణమ్ము
పలయు నీకది, యరసివచింపఁగఁ దలంతు నరుదెమ్మిటకుక్.

ద్రౌప॥ (తనలో) పాపము! ఆయన యిప్పటి యీయుద్యమం బెఱుఁగఁడు.

నార॥ అవును. ధర్మరాజునకుఁ గూడ ధర్మములు చెప్పుట కాయనఘుఁడే తగిన
వాఁడు. తరువాత.

కృష్ణ॥ క॥ ఏ నిపుడు చెప్ప నెంచిన, యీనీతులు రాజ్య మూనియే వినవలె వేవే నీవు
పట్టభద్రుఁడవై నాకడ కరుగుదేఁగదయ్య కుమారా!

ద్రౌప॥ (తనలో) అమ్మయ్యా! ఇప్పటికి బ్రతికితిమి. ఎవరిమాట తీసివేసినను ఆయ
నమాట తీసివేయఁగూడదు.

భీమ॥ (తనలో సంతోషముతో) ఇయ్యనఘునివై రాగ్యగజమునకు మంచి యంకుశము
తటస్థించినది.

నార॥ (ఏకసక్కెముగా)

గీ॥ నారదుఁడు గాఁడు దేవకీనందనుండు, గాఁడు భీముఁడు మంగాఁడు కవలు గాఁడు
క్రీడి గాఁడు ద్రౌపది గాఁడు "కూడ" దనినఁ, దీరదిఁక భీష్ముఁడీ తండు దీర్ఘఁగుణుఁడు,

ధర్మ॥ (వినయముగా) మీరందఱును నాకుఁ దెలుపఁ దగినవారు కారా! అందులోఁ
దమ రేమి, హరి యేమి, ఆయునకన్నను మాన్యులు,

క॥ నామనము కేవలము చిం, తా మగ్నం బైనకతనఁ దమయాజ్ఞకు నే
నై మొగియ నైతి దయతో, నీమూర్ఖు క్షమింప వలయు నియ్యెడ ననఘా.

నార॥ (నవ్వుచు) రాజా! నే నూరక యటంటినే కాని దేవవ్రతుఁడు మాయిరువుర
కన్న వేయి రెట్లధికుఁడు.

కృష్ణ॥ సంశయ మేమి?

సీ॥ జననంబు నెంతుమా? సకలాఘసంహృతిక్షమ మగు గంగగర్భమునఁ బుట్టెఁ
బౌరుషం బెంతుమా? పార్థివాంతకుఁ డైనపరశురాముని నాజిభంగపఱచె
సత్యమ్ము నెంతుమా? జనకుని పెండ్లికై తా నన్నమాట నిందనుక నిల్పె
వ్రతనిష్ఠ నెంతుమా? పార్థుచేఁ గూలి పుణ్యదినమ్ము వఱకుఁ దా నట్టె నిలిచె

గీ॥ నిందు నొక్కొక్కటియె కడు నెన్నఁదగిన. విన్నియును గల్గుభీష్మున కెవరు సాటి?
మమ్మటుంచుము భువనైకమాన్యులైన, మూఁడు, మూర్తులియ్యనఘుతో మొనయఁగలరె

ధర్మ॥ (విచారముతో) ఇట్టిమా తాతగారును, అట్టిద్రోణాచార్యులవారును వీరల
తోడనే పోల్పఁదగు మాయన్నగారును నేలోకో యీరణమున నిహతులైరి.
అక్కటా! కాలమెంత యనివార్యమైనది!

నార॥ రాజా! ఇం దాశ్చర్య మే మున్నది? భీష్మద్రోణు లిరువురు నన్యాయైకపక్ష
పాతమున మీ కుపకార మాచరింప నెంచి యస్థిర మ్మగు కాయమ్ము విడి
చి సుస్థిర మ్మగుయశమ్ము సంపాదించుకొనిరి. "నిష్పక్షపాతముగఁ బోరాడిన
వాఁడు మీయన్నగా రొక్కఁడే", యని నిష్కర్షగాఁ జెప్ప వచ్చు॥

సీ॥ గోవధమ్మునకు సంకోచించి వేఁడినతఱిని విప్రుఁడు దయ దాఁపఁడేని
బ్రహ్మాస్త్రమును గొనుపట్టున భార్గవుఁ డెఱిఁగి చెచ్చెర శపియింపఁడేని
పార్థునందలిపక్షపాతబుద్ధిని నింద్రుఁ డరిగి తన్నును బిచ్చ మడుగఁడేని
యర్ధరథునిఁ జేసి యవమానపఱచి భీష్ముం డమాయ నోరెంత చూపఁడేని

గీ॥ కుంతి "వర" మనిపలుమఱుఁ గోరదేని, శల్యసారథ్య మను ముప్పె సంగదేని
కృష్ణుఁ డన్యాయపథము సాఁగింపఁడేని, గర్ణు నోడించువారు జగానఁ గలరె

ధర్మ॥ మహాత్మా! యయ్యనఘుని గుణము లెన్ని విన్నను దఱుఁగవు దుర్యోధనుఁ డొన
ర్చిన యకృత్యములకుఁ గోపము గల్గియును నీతని ముఖము చూచునంతనే యయ్యది

పటాపంచలైపోయెడిది కారణాన్వేషణమునకు మనము ప్రయత్నించియు
నిట్లు జరుగుట యవశ్యంభావి యగుటచేఁ గాఁబోలునంత దీక్షఁ బ్రాత్రము
వహించినది కాదు

క॥ జనకుండు చిన్నతనమునఁ, జని నగరిఁ జూఁడిట్టు లాయె సంసారము నె
త్తిని బడియె "విడిచి పెట్టెద," నని కొన్నినుడులు పెక్కుదార్యులకతనన్.

నార॥ రాజా! యీయాశ్రమమున కేయాశ్రమము సరిగాదు సుమా! యేమందు వేని?

సీ॥ వేదవిహితముల నాపాదించి చరియించు బ్రహ్మచారుల కెల్లఁ బట్టుగొమ్మ
అతిథులై చరియించునట్టిగృహస్థుల నాదరింపంగఁ గల్పాగమంబు
భార్యైకయుక్తులై వనమునఁ దిరుగువానప్రస్థులకు రక్షణప్రసక్తి
సంసారహింసారిరంసా విరక్తులౌ సన్న్యాసులకును విశ్రాంతిభూమి

గీ॥ యైన గార్హస్థ్యమునను౦డియఖిలకర్మ, ములనొనర్చుచుదకును ముక్తిఁబొందవచ్చు
నట్లుకాదేని యవ్వసిష్ఠాదిమునుల, కేల, గార్హస్థ్యమునను౦డుటెఱుఁగఁ జెపుమ?

ధర్మ॥ మహాత్మా! మీయాజ్ఞ శిరసావహించుచున్నాఁడను.

భీమ॥ (సంతోషముతో) నకులసహదేవులారా!

ఉ॥ ఇంతకు మున్న వచ్చిన నృపేంద్రకుమారుల కెల్ల నేఁటియీ
వింత నెఱుంగఁ జేయుటయు వీడఖిలంబు నలంకృతమ్ముగా
నెంతయు వేడ్క సల్పుటయు నిప్పటికిం దగుకార్యముల్, ప్రసం
గింతురు గాక యిప్పుడు లోగిటఁ దగువారల నేర్పరించుచున్.

(నకుల సహదేవులు నిష్క్రమింతురు.)

ధర్మ॥ అర్జునా!

గీ॥ ఇప్పటివిశేషముల నెల్ల నెఱుఁగఁ జెప్పి "వలయు సాధనసామగ్రి గలయఁ గూర్పఁ"
డనుచు ధౌమ్యులతో వినయమున "నేను, మనవి చేసితి,, నని చెప్పుమా కుమార.

(అర్జునుఁడు నిష్క్రమించును.)

నార॥ రాజా! మేము తిరిగియుఁ బట్టాభిషేక కాలమున కరుగుదెంతుము.

కృష్ణ॥ బావా! నే నిప్పటికిఁ జని యుత్సవసమయమునకు సకుటుంబముగా నరుదెంచెదను.

ధర్మ॥ అట్లనే యొనరింపుము.

చ॥ శమభిమ లంతగా సలుపఁజాలవు నీవు, హాలాయుధుం డక
ల్మషహృదయుం డయైన మనమాటఁ దలంచినమాత్ర మందుఁ, నా
ఋషితులితపరిభావునకు నేగతి నేనియు నొప్పఁజెప్పి బల్
కృషి నొనరించి యియ్యెడకు నెట్లయినం గొని తేవలెజ్జానినా.

నీవెంబడి భీముని గూడఁ దీసికొని పోయి యతనిచేఁ దగుమాటలు సెప్పించి యతనికిఁ గోపోపశాంతి కావించి యిందులకు సమ్మతింపఁజేసి తోడ్కొని వత్తువుగాక!

కృష్ణ॥ మంచిది (భీమునితో నిష్క్రమించును.)

ధర్మ॥ దేవీ! ద్రుపదరాజనందని!

ఉ॥ పట్టపుదేవి నైతి నను భావమునన్ గరువంబు దాల్ప క
ట్టెట్టులు నేరి నేరఁ దనియింపుట యొప్పగు నట్టు లట్టి లి
ష్పట్టున వారివారికి సపర్యల నర్పణ జేసి కీర్తికిన్
బట్టగునట్టు లుండఁ దగు భారము నీతలఁ బెట్టితిం జానినా.

గీ॥ ధనములాశాశ్వతముగావుతనువులంత, కన్న శాశ్వతములుగావుకలిమిలేము
లబ్బుతజేనబ్బుటయుఁ దబ్బిబ్బుపడుట, సారవిదులైనవారిలక్షణముగాదు

ద్రౌప॥ నాధా! తమరానతి చొప్పునకే సకలము నిర్వర్తించుదానను. మనమిరు పురమును దుఃఖాంబుధిమగ్న తగు మీతల్లిదండ్రులకడ కరిగి యాదారిద్ర్యము ట్టులేని యిందులకు వచ్చునట్లు ప్రార్థింప వలయును.

ధర్మ॥ దేవీ! చక్కఁగా బోధించితివి. ఇప్పుడే పోయి యట్లొనరింతము.

(నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బగు పాండవాశ్వమేధమ్మునందుఁ
ద్వతీయాంకము.



# పాండవాశ్వమేధము.

(చతుర్థాంకము.)

---

(అంతట నొక కవి ప్రవేశించును.)

కవి॥ (విసుగుతో)

ఉ॥ ఎక్కడి కేగినన్ శిశువులే నృపతుల్ కవితారసాయనం
బెక్కడ! కుర్రలెక్కడ! యనీ యిటు లందఱి రాజులన్ యశో
భాక్కుల దాతృతాఖ్యులఁ బాండవు లేమని చంపిరో కదా!
యక్కట! సత్కవీశ్వరుల కన్న మిఁ కేగతిఁ గల్గఁగా వలెన్.

(పరిక్రమించి చెవియొగ్గి) ఇయ్యెడ రాజు నెట్లు పొగడుచున్నారో (తెరలో)

గీ॥ ఇంతశాంతుండు లేఁడు లేఁడింత దాంతుఁ, డింత సదయుండు లేఁడు లేఁడింత దాత
ఇంతటి నిగర్వి లేఁడు లేఁ డింతయోగ్యుఁ, డింతటియశస్వి లేఁడు లేఁడింత రాజు.

కవి॥ ఇట్లెల్లరొడలం గొనియాడఁబడుచున్న యీరాజు నిజముగా "పంటవలంతి నోఁచుకొన్న నోఁములపంట" యనినన్ దప్పేమి? ఇట్టిమహానుభావుని దర్శనమునకుఁ బోవుచుంటిని గదా! యొకపద్య మేనియు రచించుకొన వలదా?
(రచించుటనభినయించి)

చ॥ కృతయుగ మాది నిప్పటికి నెందఱొ రాజులుగారు రామభూ
పతి యొకరుండు దక్క నినువంటి నృపాలకు లేరి? యాతఁడుం
'బ్రతి" యని చెప్పఁజాల మొకపట్టున, నింతటిభాగ్యశాలి వై
క్షితి నలరించు నీకు దయచేయు రమాపతి సర్వసౌఖ్యముల్.

పద్య మనుకూలముగాఁ గుదిరి యుండునా? కుదుర కేమి? గాని కొంచెమతిశయోక్తిపడినట్లుమాత్రము తోఁచుచున్నది. లేదు! రాముఁడు తప్ప నింతటిరాజు లేనే లేఁడు. ఉన్నచో నాదికావ్యమును రచించినవాల్మీకి యాతనిచరిత్రమునే యేల కైకొనవలెను. తరువాతఁ దిరిగియు నట్టికవి యున్నచో నీతనిచరిత్రము వ్రాయఁ

దగినది. ఇందులకు నిప్పటివారిలో వ్యాసులవారే తగినవారు ఒకొక్కకపట్టున నియ్యనఘునికి శ్రీరాముఁడునుందుల్యుఁడుగాఁడు. సత్యమే ద్రౌపదిం జెఱగొన్న సైంధవు నీతఁడుప్రాణావశేషముగా విడిచినాఁడు. రాముఁడో! సీతంజెఱగొన్న రావణునిఁ బుత్రమిత్రసమేతముగ నశింపఁజేసెను. సరే ఇక్కడికిఁ బద్యము కుదిరినది. రిక్తహస్తములతో రాజుం జూడఁగూడదు. (దృష్టి నిగుడించి) అదుగో, పండ్లమ్ముకొనువాఁడొకఁ డటుపోవుచున్నాఁడు. వానినిటుపిల్చెదఁగాక. ఓయీ! పండ్లవర్తకుఁడా! ఇటురమ్ము. (అంతవర్తకుఁడు ప్రవేశించును.)

వర్త॥ ఏమయ్యా? పిల్చినావు. కవి॥ పండ్లుకావలెను.

వర్త॥ ఇదుగో, కొనుండు. కవి॥ వెల యెట్లు?

వర్త॥ జో డర్ధణావలా. కవి॥ ఇఁక నొక మాట చెప్పు.

వర్త॥ ఎన్ని సారులుచెప్పినను అంతే.

కవి॥ సరే గాని మీరాజుగారు మంచివారు కదా?

వర్త॥ ఇంతమంచివారెక్కడను లేనే లేరు.

కవి॥ తఱచుగాఁ గవీశ్వరులు వచ్చుచుందురా?

వర్త॥ రాకేమి తఱచుపండితులతోడనే కాలక్షేపము. తమరుఁ గూడఁ గవీశ్వరుల వలెనే యున్నారే? రాజుగారు గ్రామములో లేరు.

కవి॥ (విషాదముతో) ఏమీ యెక్కడికివెళ్ళినారు. ఎప్పుడువత్తురు?

వర్త॥ భీష్ములవారియొద్దకు వెళ్లినారు. వారీదినమున స్వర్గమునకు వెళ్ళెద రఁట

కవి॥ (తనలో) ఇక్కడికివచ్చినను మనదారిద్ర్యదేవత వెంటనేవచ్చినదే! (ప్రకాశము) అయినచో నాకీఫలము లక్కఱ లేదు.

వర్త॥ పోనిండు (నిష్క్రమించును)

కవి॥ ఈగొడవ యడఁగినమీఁదఁదిరిగియు వచ్చెదఁగాక. (నిష్క్రమించును)

(అంత శరతల్పగతుఁ డగుభీష్ముఁడును బాండవులును విదుర
ధృతరాష్ట్రులును గృష్ణుఁడును బ్రవేశింతురు)

భీష్మ॥ (దీనస్వరముగా) నాయనా! ధర్మనందన!

ఉ॥ నీపరిపాలనమ్ము విని నిత్యము సంతస మందు చుంటి నీ
యాపద లేక భూమిప్రజ లందఱునున్ సుఖ మందు చుండి రో

హో! పరమాత్ముఁ డిప్పటికి యోగ్యతయున్నను రాజుఁ జేసి సం
తాపము నందుభూసతిఁ దానొనరించె ముదం బెందుఁగై

ధర్మ॥ (విచారముతో) పితామహా! గాంగేయా! సర్వబంధుసంహారం బొనరించి
నే నిప్పు డిట్లు పాలించిన నేమి లాభము? అయినను,

ఉ॥ భవదుపదేశవాక్యములపై మది నిల్పి త్రికాలవేది మా
ధవునను శాసనమ్ముఁ గొని తమ్ములసమ్మతి యూఁత గాఁగఁ బె
ద్దవిభునియాజ్ఞ చొప్పున సదా విదురానుమతిన్ గృపాచార్య శా
స్త్రవిధికి లోఁగి నేను మృదుధామతిఁ జూతు సమస్తసంగతుల్.

కృష్ణ॥ తాతా! లోకైకపూత!

ఉ॥ ఎవరు సహాయ మెందులకు నీయవమాత్మున, కన్ని యెన్ని ధ
ర్మవిధులు గల్గి నన్నియును మాన్యచరిత్రుఁడ వైనయట్టి నీ
సవిధమునందు శిష్యుఁడయి సంగ్రహణం బొనరించెఁ దాను పాం
డవులకుఁ గాదె? దేహము కడంగి వహించితి వింతకాలమున్.

భీష్మ॥ కృష్ణా! వాసుదేవా!

తే॥గీ॥ ఎవనిలో నుండులోకమ్ము, లెవఁడులోక, మెల్లెడ వసించునట్టి యోగీశ్వరేశ్వ
రుండ వీవుండ వేఱొక్కరుండ వలెనె? పాండవుల పాలిపరమబంధుండ వీవు.

విదు॥ సంశయ మేమి?

తే॥గీ॥ ఎన్నియో కారణమ్ముల నిమ్మహాత్మ, మవతరించుటకై పెద్ద లందురు గాని
పాండుసుతరక్షణైకతత్పరతఁ "బని,గట్టికొని పుట్టె" నని నమ్మకమ్ము నాకు

భీష్మ॥ విదురా! జ్ఞానవిధుర! నీయూహ చక్కఁగ నేయున్నది. ఐనను.

తే॥గీ॥ ఇమ్మహాత్ముని యవతార మెన్నియేని, గారణమ్ములు గలయది గాని యందు
దిక్కుమాలిన నావంటిదీనులకు వి,ముక్తి నొసఁగుట యేసుమ్ము ముఖ్యఫలము.

ధృత॥ (కన్నీటితో) తండ్రీ! నీవు నిజముగా దిక్కుమాలిన వాఁడవే యైతివి.

తే॥గీ॥ వీర వీరార్చిత! విచిత్రవీర్యునకు వి, వాహ మొనరించితివి కష్టపడి జయించి
అతఁడు నేఁటికి బిత్య్రపకృతిని నిట్టు, లాచరించెను నావంటి యధముకతన.

అర్జు॥ (విచారముతో) తండ్రీ! యప్పట్ల నీవుగాని నీతమ్ములు గాని లేశమును నిం
ద్యులు గారు.

ఉ॥ అని నొనరింప లేక చని యాచనఁ జేసె నజాతశత్రుఁ, డీ
మనుమనియందు ననుగ్రహమ్మెయిఁ దనచచ్చునుపాయమున్ గృపా
ళుని వచియించెఁ దాత "యగుఁగా" దనకే నటు లాచరించి యి
య్యనఘుని నిట్లొనర్చితి నహో! మము నిర్భర మాలుటొప్పగున్.

ధర్మ॥ తాతా! శంతనుపుత్రి!

ఉ॥ "ఏమనికోరె వీఁడు గుణహీనుడు ద్రోహి దురాపహుఁ డక్కటా!
పామరుఁ" డంచు నెంచక కృపామతి గుట్టెఱిఁగించి నీవు మా
సేమముఁ గోరి, "యిట్టిపని సేయుట త" ప్పని యేనెఱింగియున్
భూమికి నాసఁ జేసితిఁ దపోమహితున్ గులవృద్ధుఁ జంపితిన్.

భీమ॥ (విచారముతో) తాతా! శాంతిగుణోపేత!

క॥ కులవృద్ధు నిట్లొనర్చిన, ఖలులకుఁ గులవృద్ధి గలదె? కాఁబట్టియె ని
మ్మకలుషులు సుతులు నశించిరి, కలనెల్లను దీరుపైన కారణ మనఘా.

అర్జు॥ అందునను, నేను బరమదుర్మార్గుఁడను.

తే॥గీ॥ పరశురాము జయించినబల్లిదుండు తాత, యీతనిమృత్యుతద్దయూహించి
నట్టిచెట్టంతకొడుకు దానాపాపమునఁ గూలునే? దోసములుకట్టికుడుపకున్నె?

ధృత॥ తండ్రీ! అర్జున!

తే॥గీ॥ కొడుక! మీ రేలనిందించుకొనెదరోయి? దోషమిదియెల్ల నాదుపుత్రులది నాది
దాయభాగమ్ము హరియింపఁ దలఁపకున్న, నింతపుట్టునె? యిట్లొనె శాంతనవుఁడు!

ధర్మ॥ తండ్రీ! అంబికేయ!

ఉ॥ నీకొడు కేమి సేయు? నవినీతుఁడనై చని యేను "తాత నీ
పోక కుపాయముం దెలిపి భూమికి నన్ బతిఁజేయు" మంటి "నీ
దాకడిమిన్ సహింపఁ గలవా? దయ యుంచు" మటంటి, దానఁ గా
డే? కులవృద్ధు నిట్లు బలి యిచ్చితి రాజ్యరమన్ గ్రహించితిన్.

(భీష్మునుద్దేశించి) తాతా! ధార్మికాగ్రేసర!

తే॥గీ॥ తొడలనడికొని కడుముద్దునాడరన్తి, పెంచితివి పెద్దఁ జేసితివంచితముగ
పాపజాతికిఁ బాల్పోయుపగిదియయ్యె, నెన్నిజన్మమ్ములకును నాకిదియచాలు

భీష్మ॥ తండ్రీ! ధర్మనందన!

ఉ॥ ఏల విచార మందెద? వహీనులు మీ రొక రుండఁ బట్టియే
యాలములోన నాకు మృతియబ్బ నిదే గద! క్షత్రజాతికిన్
బోలెడిచావు, యుద్ధమున ముద్దిడుకొందురె? యెవ్వరేని, దు
శ్శీలురకున్ సహాయ్యములు చేసెడివార లదండ్యు లౌదురే.

కం॥ నా కేమి పెద్దవాఁడను, జీకు కుమారుండు వీనిచేతులలో నా
పోక యుచితంబ కాదొకొ, శోకించుట తగునె? జ్ఞానశూరుఁడ వయ్యున్

కృష్ణు॥ (కన్నీటితో) తాతా! స్వాయత్తజీవన!

ఉ॥ చక్రము కేలఁ గైకొని విశాంపతు లంద ‘‘జిసీ! యిసీ! యిసీ!
యక్రమ’’ మంచు దూఱ రయ మారఁగ బాహులు పట్టి వెన్క కీ
శక్రసుతుండు లాగ నినుఁ జంపుతలంపున వచ్చునట్టియీ
వక్రచరిత్రతప్పిదము వాపి క్షమించి యనుగ్రహింపవే.

భీష్ము॥ (చిఱునవ్వుతోఁగూడిన భక్తితో) కృష్ణా! లీలామానవ విగ్రహా!

కం॥ ఎందుకుఁ గనుఁగప్పెదు? గోవిందుఁడవని మొదలనుండి విని యుంటి న్నీ
చందం బెఱుఁగుదు స్వామీ! వందనములు నీ కొనర్తు వందలు వేలున్.

కృష్ణు॥ పితామహా! కురుకులాలంకార! నేను గోవిందుఁడ నైన నగుదుం గాక దాని కేమి?

మ॥ అవనీచక్రము నెల్ల గెల్చితివి లోకారాధ్యుఁ డైనట్టివి
ష్ణ్వవతారున్ భృగుపుత్రు మించితివి నీ వాజన్మయున్ బ్రహ్మచా
రివి స్వాయత్తుఁడ వాత్మశుద్ధుఁడవు వారింప న్నినున్ శక్యమే?
యవివేకమ్మున నట్లొనర్చితిని దాతా! తప్పు సైరింపవే.

భీష్ము॥ కృష్ణా! పాపారణ్యకృష్ణవర్త్మ! నాజన్మమునకెల్ల నేనొనర్చినవే యీరెండు తప్పులు, ఒకటి గురునితో నెదుర్కొనుటయు, రెండు నీకెదురుగానుండి యని సల్పుటయు, భార్గవు నోర్చుట కేవలము నాశక్తిచేత నేయనవలను పడదు.

కం॥ గురు వగుట వృద్ధుఁ డగుటన్, గరుణాంతఃకరణుఁ డగుటఁ గలనన్నైన
న్బరమాత్మ నోర్వఁ గల్గితిఁ, దురిత మొత్తిఁ గట్టికొంటి దుర్మతి నైతిన్.

ఇంతకు నప్పటి కయ్యానఘునియందు విష్ణ్వంశము లేక పోవుట ముఖ్యకారణము.

అర్జు॥ తాతా! ధానుష్కైకశరణ్యా! ఇయ్యెడ నీత ప్పేమున్నది.

ఉ॥ ఆయన కాయనై రణమునందలి కోర్కె నినుఁ వరించె లే
దే? యిటు దోష మించుక యు, నే నొనరించితి మెట్టికూళలున్
జేయఁగ రానికృత్యము, లజేయు నినున్ గురునిఁ భవత్సుముఁ
మాయ మెయిఁ వధించితి మహాయికులన్ గరుణాంతరంగులఁ.

భీష్ము॥ నాయనా! ఇంద్రినందన!

తే॥గీ॥ నరుఁడవీవితండు నారాయణుండు మీ, చరితమెఱుఁగ నట్టిజడుఁడఁ గాను
'వీరా లుండి' రనెడికారణమ్మునని యు,ద్ధమున కేను సమ్మతమ్ముగంటి.

(సంతోషముతో)

తే॥ గీ॥ మరణ కాలమ్మునందొక్క పరినొడివిన, నెవని నామంబు మోక్షమ్మునిచ్చుఁదిరు
నట్టివిష్ణుండు నాదుప్రియాణసమయ, మునకు దయచేసె నాపుణ్యమూననకాదె.

భీము॥ (కన్నీటితో) తాతా! త్రిలోకవంద్య!

కా॥ ఆయాసమ్ముగ నుండఁ బోలు నిఁక మాటాడంగ లే వేమొ నీ
దాయాదాపకృతుల్ క్షమించి కరుణన్ దైవార నీక్షించి యి
మ్మా? యాశీర్వచనంబు, పాదములు తెమ్మా? యొత్తెదన్ మ్రొక్కెదన్
గాయంబుల్ నిలువెల్లఁ గన్గియును శక్యంబే? యిటుల్ నిల్వఁగన్.

భీష్ము॥ తండ్రీ! వాయునందన!

చ॥ జనకవరప్రసాదమున సాయకబాధ యొకింత లేదు నీ
మన మతి నిర్మలం బెపుడు మాయ నెఱుంగవు వెల్తిలోపముఁ
గనుటయ కాని, యంతటనె కారుణికత్వముఁ దాల్తు సేవ చే
సినసుకృతమ్ము నైకొనను చెందె మనమ్ము ఘనప్రమోదమున్.

(కృష్ణునుద్దేశించి) కృష్ణా! పరలోకబాంధవ!

చ॥ మృదు పగు వెన్నవంటిది శరీరము నీయది, యిష్ట కష్ట మ
న్నది సయిపంగ నేరదు పదాలుసహస్రియు లిందుకై సదా
మది జపియింతురి గోపికలు, మాధవ! నిష్కరుణుండ నైననా
ప్రిదరము లిందునాటి యపరాధ మొనర్చె ననుగ్రహింప వే.

ధృత॥ (కన్నీటితో) తండ్రీ! నాగతి యేమి చెప్పితివి?

తే॥గీ॥ కన్నులా? లేవు మదికి సౌఖ్యమ్ము లేదు, కొడుకులా? యున్నలా? యెందుకోస మేను
నన్ను నీవెంటఁ గొనిపొమ్ము నాథ మైన, పేర్మితమిందున్నవందున్న నేమిఫలము.

భీష్మ॥ నాయనా! అంబికేయ!

ఉ॥ ఏల యధైర్యమున్ గనెద వేగురు పుత్రులు గల్గి యుండియున్
బేలవె? కూళ లౌ సుతులు పెక్కురు గల్గిన నేమి, యొక్కఁడే
చాలుఁగదా! సుశీలుఁడు, విశాలనయుల్ మఱి వీఁ లందఱున్
జాలిఁ బడంగ నిత్తురె? విచారము నొందకుమయ్య? పుత్రకా.

విదు॥ (కన్నీటితో)

క॥ ఏసందియమ్ము గల్గిన, నాసందియ మంతలోన నడఁగించుమనుప
ర్వ్యాసకునిన్నుఁ దండ్రిని, బాసి యెటుల్ ప్రాణములను బాయక నిలుతున్.

భీష్మ॥ విదురా! జ్ఞానవిధుర!

తే॥గీ॥ కృష్ణుని శివనినదయ కేవలముగ, స్వయముగాఁ బండితుఁడవీవు నసురమతివి
నేను జెప్పనక్కఱలేదు గాని యిమ్మ, పరమహు భజింపుమి హానుమనబ్బుఁ బరము

కృష్ణు॥ తాతా! దేవవ్రత!

క॥ ధన్యుఁడ వీవు మునురా, జన్యులు పెక్కండ్రు గలరు జ్ఞానమునఁ ధృతిన్
జన్యమ్మునన నన్యమ్మునన, మాన్యత నీవంటి మేటి మానిసు లేరీ?

భీష్మ॥ కృష్ణా! వసుదేవనందన!

తే॥గీ॥ ఆలుబిడ్డలు లేకున్నయట్టి నాకు, సమయమునకబ్బె నీదుదర్శన సుకృతము
సెలవుదయసేయుమయ్య? నీచేననుజ్ఞఁ, గొంటినా పరమున నెందుకొదువ లేదు.

అర్జు॥ (కన్నీటితో) తాతా! సద్గుణాశ్రిత!

క॥ గీతలలో హరి సెప్పిన, యాతీరెల్ల భవదీయ మహామరణమునన్
జూతు నిటువంటి విజ్ఞా, నాతీతులు కోటి కొక్కరైనను గలరే?

భీష్మ॥ నాయనా! హరినందన!

క॥ హరి యనఁగ నీవనఁగ నొండొరులె? యవతారపురుషు లొక్కొకకా
ర్యాంతరములనిటు జన్మింతురు, నరనారాయణులు వింటినారదుకతనన్.

కృష్ణు॥ తాతా! భువనైకపవిత్రచరిత్రుండవగు నీకెవరియాజ్ఞతో నేమియవసరము.

ఆ॥వె॥ ఈవు ధర్మపరుఁడ వెలుఁగని దొక్కటి, యేదు నాయెడలమహోదరమ్ము
గలుగుకతన నిట్లు గాఁబల్కితివి నీవు, భీష్మసిద్ధియగుఁ బ్రికృష్టప్వాదయ.

భీష్మ॥ (సంతోషముతో)

క॥ నీయాజ్ఞ వడసితిని నా, కేయే శోకముల నేని నీక గోపము రా
దో యదునందన! కృష్ణా!, పోరొదవ యుంచు పురుషపుంగవ! నృహరీ

(ధృతరాష్ట్రాదుల నుద్దేశించి) తండ్రీ! ధృతరాష్ట్ర! నాయనా! విదుర! కుమారా! ధర్మనందన! మీయందఱిచేత ననుజ్ఞాతుండనై పరముఖమ్మున కేగుచుంటి నాకై విచారింపకుడు.

కృష్ణ॥ తాతా! నేడు మాఘశుద్ధద్వాదశి, ఇట్టిపుణ్యదినమ్మున నీవు దేహత్యాగం బొనరించి పరమ్ము నలంకరించుచుంటివి, కాననీదినము స్వతఃపవిత్రమైన దయ్యు మఱింత వన్నె కెక్కి నీపేరఁ బ్రసిద్ధి వడయుఁగాక మఱియు,

తే॥గీ॥ విప్రులెల్లరు నీకుఁ దృప్తిగను నేఁటి, దినము ప్రతివత్సరమ్మున దీర్ణ చరితు
నిన్ను ధ్యానించి పితరులమన్నించి తర్ప, ణములనిత్తురుగాక పుణ్యమునుగోరి.

భీష్మ॥ దేవా! నీయనుగ్రహమున్న నాకొక్కటియుఁ గొదువలేదు నేను యోగ మార్గమ్మునఁ బ్రాణమ్ములువిడువందలంతుఁగాన నాశించుక యావరణం బేర్ప ఱచి మీరందఱును గొండొక దవ్వున నిలుతురు గాక.

ధర్మ॥ ఎవరురా? అక్కడ. (తెరవైతురు)

కృష్ణ (తెరసందునుండిజూచి ధర్మజునితో)

క॥ చూచితివే? ధర్మజా! స, త్యాచారుండైనయిమ్మహామహుయోగ
ప్రాచుర్యమ్మిటువలెనే, యాచార్యులునేర రిది యథార్థము సుమ్మీ!

విదు॥ (అట్లనే చూచి) ఓహో! యిదివిచారకర మయ్యును నత్యాశ్చర్యం బగు చున్నది.

తే॥గీ॥ ప్రాణముడిగినపట్లశల్యములులేవు, కలవె? యిట్టివియోగము యోగగరిమ లెందు

(ఆకాశమువంక చూచి)

అదుగో! బ్రహ్మరంధ్రముననుండి యనుపమాన, మైన తేజంబొకండేగునంబరమున

(అందఱును నాశ్చర్యపడుదురు. పుష్పవృష్టి కురియును)

కృష్ణ॥ (ఆశ్చర్యముతో)

ఉ॥ చావులులేవె? యిట్టిక్రియ? జచ్చినవారల నెందుఁ జూడ, మీ
పావనుకారణమ్మున నీ భారతవంశము వన్నె కెక్క జ

న్మావధిఁ జచ్చునంతకు రవంతయు లోటును లేనిశౌరి నెం
దే వినియుంటిమే? కనిరే? యిట్టివిచిత్రము లెందు నెవ్వరున్.

ధర్మ॥ (కన్నీటితో) కృష్ణా! ఆర్తత్రాణపరాయణ!

తే॥ గీ॥ అక్కటా! యెందఱో రణమాచరించి, రందుఁ బెక్కండ్రుగలరు బలాతిశయులు
''కాదు'' కనియుఁ ''దాత'' యని చెప్పికొనుటగాదు, నిక్కమీయిర్వురకు సాటి నేను
గాన.

ధృత॥ అక్కటా! యెంత మందభాగ్యుఁడను? ఎన్ని దుఃఖములు భరించుచున్నాఁ
డను?

గీ॥ కొడుకులందఱు వోవుటకున్ సహించి, నట్టిమనమే మొ? యిదిసవ్యమని యెఱిఁగియు
బొంగిపొరలుదుఃఖాంబుధి ముంగుడువడుఁ, దండ్రి నేఁటికిన్నుఁ బెద్దఁగనౌనర్చె

విదు॥ సచ్చరిత్రులమరణమునకు జగమంతయు దుఃఖించును. ఇప్పట్లు బంధుత్వాదిక
మనవసరము. (కన్నీటితో) తండ్రీ! గాంగేయ!

తే॥ గీ॥ ఏను వృషలుండ నయ్యు విజ్ఞాని నైన, నీవు చేపట్టి పేర్మిమన్నించు కతనఁ
బ్రబలి రాజులచేనిమ్మపండ నైతిఁ? గలదే? లేకున్న నా కిట్టిగౌరవంబుఁ

(వ్యాసులు ప్రవేశించును.)

వ్యాసు॥

గీ॥ బ్రతుకఁదగినంతకాలము బ్రతికి కులము, వన్నెకెక్కించి జగతికిఁదన్నుఁ దెలిపి
యరిగె నాసోదరుం డమరాలయమునఁ, దన్నెదురు మాచు వారిమదమ్ము దీర్ప

ధర్మ॥ (విచారముతో) తాతా! సాత్యవతేయ!

తే॥ గీ॥ ''తండ్రిలేనిపిల్లల'' మనిదయఁదలంచి, తక్కు మనుమలకన్న నదనముగాంచి,
పెంచి విద్దెయు బుద్ధి చెప్పించినట్టి, తాత నిటు చేసినారము చేతులార.

వ్యాసు॥ తండ్రీ! ధర్మనందన!

గీ॥ ఎవ్వరో యొక్కరు నిమిత్తమింతె కాని, యితరుఁడితరుని జంపుటయే హుళక్కి
అందులో నీతఁడనిన స్వచ్ఛందజీవి, యేల పరితాప మందెదోయీ కుమార!

చ॥ మరణ మలంఘ్య మేరికిఁ, గ్రమమ్మున వృద్ధుల పోక యందులోఁ
బరమశుభంబు దానికి లవమ్మును జింతిల రార్య, లిట్టిసో
దరుఁడు గతింప నేను బరితాపము చెందుట మాననేని నీ
వరసి మనంబునం దుడుగుమయ్య విచార మదారవర్తనా

కృష్ణ॥ బావా! వారియుపదేశమునందలిసారమును గ్రహించి దుఃఖ ముడుగుము. అదే! భాగీరథీతీరము. మన మండలమును నిప్పట్లు నప్పరమపావనియందు స్నానం బొనర్చి యిమ్మహామహుని కనంతరకృత్యములు నెఱవేర్ప నుంకింపవలయు నటు చనుండు (పరిక్రమింతురు) (గంగ ప్రవేశించును).

గంగ॥ అయ్యో! అయ్యో! తండ్రి వ్యాసాదులతో పాటు చిరంజీవి వగుదువనుకొంటిఁ గాని యింతలో నిట్టగుట యెఱుఁగనైతినోయి

క॥ ఎనమండ్రు కొడుకులకు నో, ర్కనికేనియు నోఁచనైతిఁ గాలస్థితి కే
మని వగతు గొంతికొడుకే, మని నిన్ను వధించె నేఁడి? యాతఁడు కొడుకా!

తే॥ గీ॥ జనన మందినదాది యీసరికి లెక్క, కొక్క తప్పని లేని నిన్నొకమార
"పంకవృ ద్ధని" యేనిఁ గవ్వడి యెఱుఁగఁ; డాయెనా! హాయనా! యేమిసేయ
నయ్యా?

అర్జు॥ (తలవంచికొనును)

కృష్ణ॥ (అర్జునుని కడ్డముగాఁ దానునిలిచి) అమ్మా! త్రిలోకపావని.

చ॥ ఎఱుఁగనిదానవేని యెవరేని వచించుట, నీకుమారుని
"న్నరుఁడు వధించె" నన్న నెటు నమ్మితివమ్మ తదగ్రమందునన్
నరులటులుండ రక్కసులు నాకనివాసులు నొక్కలెక్కయే
దరమునఁ గాదె? భృత్యునివిధమ్మున మృత్యువు నిల్చె దవ్వుగన్

వ్యాసు॥ అమ్మా! త్రిలోకజనని!

క॥ నరుఁడీతని వధియింపఁగ, హరశిష్యుండైన జామదగ్న్యునికన్నన్
శరవిద్య నధికుఁడే? యి, ప్పరముఁడు తనయంత విడిచెఁ బ్రాణములనొగిన్.

కృష్ణ॥ సర్వజ్ఞ వగునీ వెఱుఁగని దే మున్నది?

తే॥గీ॥ అతడు "వసువులలో నొక్కఁ" డని యెఱుఁగవో?
శాపవశమునఁ బుట్టునంతమ్మెఱుఁగవో?
తండ్రి యిచ్చినవరమువిధ మ్మెఱుఁగవో?
సకల మెఱిఁగి శోకించుట జనునె నీకు?

గంగ॥ (కోపముతో) కృష్ణా! కురుకులమారక!

తే॥గీ॥ అంతయును నిక్కమే యగునైన నేమి, కడుపు దరికొనియండు నెక్కరణినైఁతు
నాయసురు మిన్నక యుపోదు నరునిశిరము, కొలఁది కాలమ్మునన త్రెళ్ళగలదు ధ్రువము.

ధృత॥ (విదురునితో జనాంతికము) ఆఁడుది యైనను నీమె మంచికార్యము చేసినది. నూరుగురు కొడుకులను జంపినను మారకొమటకు గ్రుడ్డిధృతరాష్ట్రుఁడు కాఁడు? కానియీశిక్ష భీమునకు జరిగినచో నా కడుపుమంట కొంత చల్లా రును. ఎట్లయినను ఆఁడువాండ్రలో నీమెయు, మగవాండ్రలో నశ్వ త్థామయు, వీర లిరువురే వీరల నధఃపాతాళ గంగఁ ద్రొక్కినవారు.

విదు॥ (జనాంతికము) అన్నయ్యా! యేమి నీయవివేకము? మొదల నుండియు నీకీ యవివేకమే యింత తెచ్చినది. ఎప్పుడును ధర్మము జయించును అధర్మము డుగంటును, ఇంతకు "గంగళపించె" ననికదా? నీవుసంతసించుట ఆపెయు నిప్పట్లనీవలెనే యవివేకురాలు.

తే॥గీ॥ ఎవనిపాదమ్మునను జనియించుకతనఁ, దనకునింతటిఘనత పావనతగలిగెనతఁడు
శ్రీకృష్ణుఁ, డితనికినర్జునునకుఁ "జచ్చినను జత్తు" మన్నంత సఖ్యముపరు.

ధృత॥ (జనాంతికముగాఁబశ్చాత్తాపముతో) అవును నీ వన్నమాట నిక్కమే.

క॥ సుతులు నశించినకతమున, మతిచెడి యిట్లంటిఁగానిమహానీయులు పాండు
తనయులు, లందును గృష్ణుని, చతురత వారలకుఁ బెద్దసాయ మ్మనఘా.

విదు॥ (జనాంతికము) అదుగో! కృష్ణుఁడేమో చెప్పుచున్నాఁడు అది వినుము మన మిప్పు డిట్లు గుసగుస లాడుకొనుచుండుట యంత భావ్యము గా నుండదు.

కృష్ణు॥ దేవీ! విష్ణుపాదోద్భవి!

గీ॥ ఎన్నఁడును లేనికోపమ్మునిట్టులూనఁ, దగునె? మహముఁడుధర్మతత్పరుఁడుసుగుణి
వినయవంతుండు మిగుల వివేకి నీకు, భర్త, యీతని కిట్టికోపమ్మె? యకట!

వ్యాసు॥ (అర్జునునిచే మ్రొక్కించి)

క॥ మునిమనుమనిపైఁ గించి, త్తనుగ్రహము చూపు మమ్మ? యాతనియాజ్ఞం
గొనియే యేపని తండో, జననీ! శాపాంతమును బ్రసాదింపఁ దగుఁజే.

గంగ। (శాంతముగా) కృష్ణా! కృష్ణద్వైపాయన!

క॥ ఇతఁ డుత్తముండె యగు నే, నితని శపించుటకు కారణ మీ రెఱిఁగిననే
మ్మతి గని యొకింతలోపల, బ్రతుకుఁ దద్విధము చెప్ప వలనుపడ దిటన్

వ్యాసు॥ (తనలో) ఓహో! ఇదియా హేతువు? అన్నా! వసువులెంతపట్టుపట్టినారు:

తే॥గీ॥ అయిన నేమాయె దీనికి నహితులౌర, తంసమైన యులూపి ప్రశంసనీయ
మైనపని చేసె వసువుల నాశ్రయించి, నరకమునకన్న నిదియెయెంత యుహితంబు,

కృష్ణు॥ (తనలో)

తే॥గీ॥ బభ్రువాహనుకతమున బవరమున శిరంబు దెగు నీతనికిఁ, దనరమణి నాగ
కన్య బ్రతికించు, గాంగేయుఁ గలఁగపట, వృత్తిఁ జంపినదోసగున దిదియొకాంతి

ధృత॥ (విదురునితో జనాంతికముగా) తమ్ముఁడా! భాగీరథి యేమో కొంత దాఁచి
పెట్టినది యది నీవు గుఱుతింపఁగలవా? భావికార్యవేత్తవుగదా?

విదు॥ (ధ్యానము నటించి) ఆ! తెలిసినది. కాని యది దేవరహస్యము. బయలు సేయ
వలను పడదు. ఇట్లు జరుగును (చెవిలోఁ జెప్పును.)

ధృత॥ (తనలో)

తే॥గీ॥ తీర్థయాత్రను భార్యఁగా దీసికొన్న, యందులకుఁ దగ్గ యుపకృతి నాచరించి
తేయులూపి? మదాత్మజుఁ జెడిట్టి కాంత, నొక్క తెను గట్టికొన్న వాఁడొకఁడు లేఁడు
ఈరహస్యము వెలిఁబుచ్చినచో "బభ్రువాహనునితో నర్జునునకు సంగరమే లేక
పోవు" నని కాఁబోలును దేవధుని కప్పి పుచ్చినది. (తలపంకించి) పోనీదీని
నేను బయలుచేయుదునా? (పెదవివిఱిచి) అయిన నేమగును?

క॥ తాత నిటు చంపినందుల, కీతని కొకకొంత నరక మేర్పడు దాన
న్నాతనివి తీరునే? యిటు, లేత న్నాత్రన్ను నరక మేరికి లేదే.

ఇంతకు నిదియేని భీముని కైనంగదా! యేను సంతసింప వలసినది. విదురుఁడు చెప్పినట్లిది
యును సమంజసను గాదు.

గీ॥ కన్నకొడుకులకన్న మిక్కుటపుఁ బేర్మి, నన్ను మన్నించుచున్న పాండవులయెడల
దోసఁగు దలఁచుటకన్నను దోసము గ్నా? తిన్న యింటివాసమ్ములెన్న తగున
నాకింతటెనుండెదేని భగవంతుఁడు మంచిబుద్ధినిఁ బ్రసాదించుఁగాక.

ధర్మ॥ (తనలో) ఏదోయొక గొప్పయిక్కట్టు నుదప్పించుటకై యీమొయిట్లు శపించియుం
డును. ఇంతకన్న గొప్పకష్ట మేముండునో (యోచించి) ఉండకేమి నరక
మున్నిటికన్నను దురంత మైనదికదా? (ప్రకాశము) దేవీ! శాపాంతము నను
గ్రహించి నాతమ్ముని మరల నాకిచ్చితివి.

ఉ॥ నీకొమరుండు పోవుటకు నేను బ్రధాననిమిత్త మిట్టి దు
ర్ధీకునినన్నుఁబోవిడిచి దీనుఁడు తమ్ముని కల్గ నేల? నా
కికతనకీ మహానరక మెట్లొడఁ గూడదొ? చెప్పు మమ్మ నీ
వేకద! యిట్టిపాతకుల నేనిఁ బవిత్రులఁ జేతు వెమ్మెయిన్.

గంగ॥ (శాంతముగ) తండ్రీ! నీ కన్నిటికిని కృష్ణుఁడే కలఁడు.

గీ॥ అశ్వమేధమ్ము నొనరింపు మఖిలదోష, ములు నశించు నక్కృతమునఁ బుణ్యలోక
మునకుఁ బోవేర్తు వీవు, తమ్ములకు నెట్టు, లేని నరకమ్ము దప్పని దేనిజంబు,

ధర్మ॥ (విచారముతో) తల్లీ! నా తమ్ములు లేని స్వర్గమునక, నాకును నరకమే యనుగ్రహింపుము.

గంగ॥ కుమారా! యేదియనుగ్రహించుటకేని యొకరివశమా? వారివారి సుకృతదుష్కృతములం బట్టి యుండును. నీకు నరకమ్ము దర్శనమాత్రమ్మునందితి. నీ తమ్ములకును ద్రోపదికిని బుత్రులకును దక్కంగల్గువారలకును యతిక్రాంచిదనుభవంబునంగాని తీరదు పదపడి యందఱికిని బుణ్యలోకమ్ము గల్గు. వత్సా! యొకపరి కొమరుని గడసారి చూచుటకునై మనసు తత్తఱపడుచున్నది. నాకచటికిఁ దోవ చూపుము.

ధృత॥ (సమీపించి) తల్లీ! నేనిప్పటికిని నిట్లుండవలసినవాఁడనే కద! నాకు విముక్తి ననుగ్రహించి రక్షింపుము.

క॥ పోయినవారలు పోయిరి నీ యనఘులయెదుట నైన నేఁ గాయంబుఁ
బాయుదునో? లేకిట్లన, రాయికియగు మోఁదుకరణిఁ గ్రాలుదునో కో.

గంగ॥ తండ్రీ! అది యెవరితరము? ఇది యెవరితరము?

విదు॥ అమ్మా! త్రిపథగ!

గీ॥ ఏనెవఁడనయ్య భవతీయ సూనుదయను, గౌరవకుటుంబమందు నొక్కరుఁడనైతిఁ
బతితపావని? నాకు సవ్యమగుమరణ, మిచ్చి కాపాడుమమ్మరో? యిదియచాలు

గంగ॥

తే॥ గీ॥ మీరలిరువురుఁ గుంతి గాంధారి సంజ, యుండుఁ గొంత శోకవనిఁ దపముండి పాండ
వులుగతింపకమున్న పోవుదురయాద, వులు నశించిన పైఁ బాండవులు నశింత్రు

మఱియు నొక్క విశేషంబు, పాండవాగ్రజుండును నీను ధర్మాంశసంభవులగుటం జేసి నీ తేజమ్ము మహాత్ముని యందైక్యమ్ము నొందఁగలదు (గంగ నిష్క్రమించును.)

వ్యాసు॥ తండ్రీ! విదుర!

క॥ కొండొక కతమున మాండవ్యుం డాగ్రహమంది ధర్మునొగి శపియించెన్
దండధరుఁడు దాసీపు, త్రుండై నాకతన నిల్లుదోఁచెను వత్సా.

కృష్ణు॥ మనమిఁక నిమ్మహాభాగునకు నుచితకృత్యములు నెఱవేర్చి భాగీరథీస్నానమ్ము లాచరింపవలయును. (అందఱును నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బగు పాండవాశ్వమేధమ్మునందుఁ
జతుర్థాంకము.





# పాండవాశ్వమేధము.

(పంచమాంకము)

---

(అంత ధౌమ్యులు ప్రవేశించును.)

ధౌమ్యు॥ (సంతోషముతో) భగవదనుగ్రహమువలన నేఁటికి మాయజాతశత్రునకు మంచి దినములు వచ్చినవి.

ఉ॥ మృత్యుఁ డగునుత్తరాసుతుఁడు కృష్ణుదయన్ బ్రదికెన్ దుషారప
ర్వతమున కేఁగి యయ్యెడల వ్యాసులు చెప్పినయట్టు లద్రిజా
పతిని యజించి యందుఁగలపాఁత్రములన్ బెకలించి ద్రవ్యము
న్నతముగఁ దెచ్చి యాగము నొనర్పుటయే కాదు వింక మీఁదటన్.

ఓహో! యిట్టియాగ మెప్పుడును గన్నదియు విన్నదియుఁ గాదు గదా!

తే॥గీ॥ సవనపాత్రల లెక్కేమి? కాలగూడ, బంగరువుతోడ నిర్మింపఁబడియె నిందుఁ
గొదవ యేమి? మరుత్తిచ్చెఁ గొల్లగాఁగ, ద్విజుల, కదియెల్ల వీరియధీనమయ్యె.

అహహ! ఆబ్రాహ్మణులు పట్టుకొని పోయినది పట్టుకొని పోఁగా మిగిలినదే యింత యున్నప్పు డంతయు నెంత యుండునో? ఇంతకు నిప్పటిసుకృత మా మరుద్భూపాలునిది. కాదు కాదు. ఋత్విక్కులది, సంశయ మేమి. ద్రవ్యప్రాప్తికిఁ గదా తజ్జన్యసుకృతము చెంద వలయును. (యోజించి) సుకృతము మాటట్లుండ బ్రాహ్మణద్రవ్యాపహరణదోషము తటస్థించుచున్నదే! వినను.

తే॥గీ॥ వారుపాత్రలవై చెడిపట్టినందు, సమయమున నొనర్చికొనిరఁట "జనుఁ డెవండు
దీనిఁగనుఁగొనునిది వానిదే" యటంచుఁ, గానవిప్రస్వహరణశంకయిట లేదు.

(పరికించి) అదిగో అశ్వోత్సర్జనము చేయించుటకై నాచే నంపఁ బడిన నా ప్రియశిష్యుండు కాణ్వుండు వచ్చుచున్నాఁడు. ఇతనివలనఁ గొన్ని విశేషములు దెలియఁగలవు

(అంతట శిష్యుడు ప్రవేశించును.)

కాణ్వు॥ గురువరా! నమస్కారము.

ధౌమ్యు॥ విద్యాభివృద్ధి ర్భూయాత్, చక్కఁగానాయాశీర్వచనమును తెలుపెర్పింపఁ గలిగితివి కదా!

కాణ్వు॥ దేవరయాశీర్వచనమున కెందునుం గొదువరాలేదు.

ధౌమ్యు॥ అచ్చటివిశేషములఁ గ్రమముగా జెప్పుదువుగాక

కాణ్వు॥ చిత్తము. ప్రథమమున నేను ధర్మరాజు గారియెదుటి కేగినతోడనే నమస్కరించి మీకుశలంబడిగిరి.

ధౌమ్యు॥ ఆశీర్వచనము సమయానుగుణముగాఁ జేసితివా.

కాణ్వు॥ చిత్తగింపుఁడు.

ఉ॥ పోయినవంశనా నిలిచె భూరియశ మ్ముదయించె యాగమా
చేయఁగ నుంటి సర్వమును సిద్ధము సాధ్య మొకండు లేదు నీ
కోయనఘ! దీవన లొకండు టెఁకొందుకుఁ గాని యైనను
శ్రేయము తృప్తి కొందగదు చేకొనుమయ్య మహోదయమ్ములన్.

ధౌమ్యు॥ (సంతోషముతో) ఔఁర నేమి! "నేను నీవింతవాఁడ" వని యనుకోలేదు సుమీ! తరువాత.

కాణ్వు॥ దానిపైరాజుగారు "ఇపుడు కావింప నున్న యశ్వమేధము నిర్విఘ్నముగా నెఱవేఱునట్లాశీర్వదింపవలయు" ననిరి.

ధౌమ్యు॥ కార్యాసక్తిచే నాతడట్లు కోరెనేకాని, అందులకు మనయాశీర్వచన మెందుకు?

క॥ ధనహీనుండయ్యును నో, కనిబాధింపకయె వ్యాసు కారుణ్యమునన్
ధనకనకవస్తువాహన, ఘని యయ్యెన్ యాగమింకఁ గా కేమగునో.

ఇది యిట్లుంచుము.

గీ॥ నాలుగుసముద్రములఁబోలఁజాలుననుజు, లవులఁగృష్ణుండుసర్వలోకావనుండు
సిద్ధసంకల్పుఁడాతండు చేయుఁబూన, నిందువిఘ్నమ్ములనుగూడ నెందుకబ్బు.

తరువాత

కాణ్వు॥ అశ్వమునువదలుచు వెనువెంబడిపోఁదలఁచిన యర్జునుతో నారాజశేఖరుఁడు చెప్పినమాటలు కడునీతిదాయకములు గానున్నవి.

ధౌమ్యు॥ అతనినోట నెప్పుడేది యుచ్చరించినను నదియట్టిదే, వినను విందుము. చెప్పుము.

కాణ్వ॥ మనవి చేయుచున్నాను. అజాతశత్రుఁడు తమ్ముని నిలిచి.

ఉ॥ తురగము వెంట నేగుచు చతుర్బలరాశిపరీతభూపురం
దరు లెవరు న్నిరోధము నొనర్ప నొనర్చినచోఁ గృపారసం
బులుఁగ నప్పటప్పటికి నొప్పిడిరీతి నొనర్చు మాఁగ్రిమా
స్ఫురణము చూపి వేగ పొరిపుచ్చుము మింతకు వచ్చి రెల్లరున్.

ధౌమ్య॥ చక్కఁగా నుపదేశించినాఁడు. దానిపైఁ బార్థుఁ డేమనియెను?

కాణ్వ॥ ఇట్లు పలికెను. అన్నా! ధర్మనందన!

తే॥గీ॥ "ధర్మజునియశ్వ" మన్న నే ధరణిపతియు, నడ్డగింపఁడు సమరంబునవ
సరంబు.

ధౌమ్య॥ సంశయ మేమి?

కాణ్వ॥గీ॥ ఎదిరిఁదన్ను శెలుంగక యెవ్వఁడేని, యడ్డినను వానియసువుల కాసగొనను

ధౌమ్య॥ ఇతఁడు మాత్రి మెవరు? ధర్మరాజు తమ్ముఁడు కాఁడా యేమి, తరువాత.

కాణ్వ॥ మరలఁ బాండవాగ్రజుండు, ఆయా రాజులతోఁ దనమాటలుగా నిట్లువిన్న
వింపు మనియెను.

ధౌమ్య॥ ఓహో? ఏమయా! యావినయము. ఏమని చెప్పుమనియెను.

కాణ్వ॥ఉ॥ జ్ఞాతులఁ దక్కు భూపతులఁ జంపినపాపము, నిస్తరింప మే
మీతఱి నశ్వమేధమున కిచ్చ యొనర్చుట, యంతెకాని ప్రి
ఖ్యాతికిఁ గాదు మీరు త్వరగా సవనమ్మును జూడరండు ద
ర్పాతిశయమ్ము చూపకుఁ డహంకృతికాలము కాదు భూపతుల్?

ధౌమ్య॥ సరే, ఆయన చెప్పవలసినసంగతి కనుకఁ జెప్పినాఁడు, కాని నిజముగా
నొక్కొక్కఁగా డెవఁడేని యెదురైనచో నంతమాత్రమునకు మరలఁడు.

కాణ్వ॥ అట్లు మరలనివారిం గురించి యిట్లు జరుపు మనెను.

ధౌమ్య॥ ఎట్లు?

కాణ్వ॥ఉ॥ సారథిఁ గొట్టియో, రథముఁ జక్కడఁగించియొ వాజులన్, వెసన్
బాలుఁగఁ ద్రోలియో, ధను వహాస్త్రముఁ జేసియొ వారిఁ దున్మిచియో
వారి కొకింత నీదుబలవైఖరి చూపుదు గాని, చావరా
దేరును, నట్టివార్తవిని యే సయిరింపఁగఁ జాలఁ దమ్ముఁడా!

ధౌమ్య॥ అతనివచనము లెన్ని విన్నను దనివి తీరదు, తరువాత,

కాణ్వు॥ అశ్వము వెంటపార్థుఁడరిగిన యనంతరమునఁ గౌంతేయాగ్రజుండు నన్నుం జూచి.

తే॥గీ॥ అన్నియును జెప్పిరేనరుననిపినాఁడ, గానిమది సందియంబది గానదకట
ఎక్కడేమగునో! యెవ్వరెదురుకొందు, రో! యెవరిఁద్రుంచునో దయయుడిగి యితఁడు

ధౌమ్యు॥ సర్వమును శుభమే యగుఁగాక, రాజా! నీకీసంశయ మెందుకు.

క॥ పడముడిననిపినచోఁదుం, దుముకేదియు నేసియు చటఁదొడరినఁదొడరున్
గడుశాంతుఁడు కవ్వడి యీ, తఁడు మఱచునె? నీదునాజ్ఞ తత్తఱపడునే.

కాణ్వు॥ నేనును ఇట్లే పలికితిని తరువాత నన్నృపాలుఁడు.

తే॥ గీ॥ ధర్మసంవేది విజ్ఞానితండ్రివెనుక, తండ్రియంతటివాఁడు పెత్తండ్రియమ్మ
హోత్మకడకేగియాతనియాజ్ఞవడసి, యశ్వమేధమ్ము నడుగఁ గర్తనగుట మేలు.

అనినన్ను వీడొకని పితృదర్శనమునకుఁ బనిచెను.

ధౌమ్యు॥ ఇది ముఖ్యముగానిట్లు జరుగఁదగినదే. నాతోడ కేమియుఁ జెప్పమనలేదా?

కాణ్వు॥ "ఋషుల నందఱిని సత్వరమునఁబిలిచిరావలయు" ననితమతో మనవి చేయ మనియెను.

ధౌమ్యు॥ సరే. అర్జునుండశ్వము వెంటఁ బుడమినెల్లఁ గ్రుమ్మరి రాజపుత్రులందోడ్కొని వచ్చునంతకు మన మీపని గాలవేర్చుకొనలేకపోదుమా యేమి? (యోజించి) ఎందుకేనియు ముందుఁదనకున్న పని నెఱవేర్చుకొనుట కడుమంచిది. కావునమనము ఋష్యానయనార్థమరుగుదము రమ్ము. (నిష్క్రమింతురు)

(అంతధనుర్ధరులైనరుపురు రాజపుత్రులు సూర్యవర్మ కేతువర్మలు ప్రవేశింతురు)

సూర్య॥ ఉ॥ మూఁకలతోడఁబోరి కడుమక్కరకృత్యము సేయుచుంటి నా
రాకరుతెంగియున్ మరలిరావదియేమి? మఖాశ్వమేనచు
మిత్రా! కదియంగఁ బట్టితిని మేటిమగండవ యేని నాపయిం
దాఁకి రణంబొనర్పుము పినాకి నెదుర్చుటఁ నేఁడుచూచెదన్

అర్జు॥ (తనలో) ఓహో! యీబాలురన్ జూచిన నామనంబు కరుణామయంబగుచున్నయది (ప్రకాశము) క్షత్రియకులాంకురములారా! నామాటవిని మీరీయశ్వము జోలికి రాకుఁడు.

గీ॥ అశ్వమేధదీక్షితుఁడయి యన్నమిమ్ముఁ. బిలువనంపింపవచ్చితిఁబిలుపుగోనుఁడు
బందుగులమైనమన కేల? బవరమిచటఁ, గదలిమీరెల్ల వత్తురు గాక యటకు.

కేతు॥ (గర్వముతో) మేము అన్యమునకు వచ్చువారమే కాని జన్నమునకు వచ్చు వారము కాము,

ఉ॥ బందుగు లందుఁ బల్కితివి బందులు గారె? సుయోధనాదు లే
చందమునన్ రణంబు కొనసాఁగెను మీ? కది యొల్లనేఁడు మా
డిందలఁ ద్రూని వచ్చితిమి టక్కరిమాటలఁ బోవ దింకఁ బో
రం దగు గెల్వఁగాఁ దగుఁ దురంగమమున్ మరలింపఁగాఁ దగున్.

అర్జు॥ మీతో నేనొక్కమాట చెప్పెదను దానివి మీరన్యథా గ్రహింపక విశ్వసించి ప్రాణత్రాణం బొనరించి కొనుఁడు.

''క॥ మనరణమునకే పోయిరి, జనపాలకులెల్ల, వారిసంతానములున్,
మనము గరుణింపఁ గావలె'' నని ధర్మజు డానతిచ్చె ననికిఁజారకుఁడీ॥

సూర్య॥ (మీసము దువ్వుకొనుచు) ఏమీ! మీయన్నగారిట్లు సెలవిచ్చినారేమి? ఓహో! యేమి యాయన యోగ్యత!

గీ॥ ధర్మరాజనుమాట మాత్రంబకాని, యంతయునధర్మమే మతఁ డాచరించె
నతనితమ్ముని నిన్నిపుడని వధింప, బుద్ధివచ్చెడుఁ బాప! మాభూమిపతికి.

అర్జు॥ (తనలో) ఓహో! అధికప్రసంగములోనికి దిగుచున్నాఁడే? అయిననునింకొక సారి చెప్పి చూచెద (ప్రకాశము)

గీ॥ గాండివంబిది వీఁడల్ల పాండవుండు, అక్షయంపుఁదూణీరము లరయుఁడివిగో
అదుగో! కపిరాజుకేతనమందుఁగనుఁడు? వినుఁడు నామాటయశ్వంబువిడిచిచనుఁడు

కేతు॥ (గర్వముతో) అశ్వమ్ము విడిచి చనుట నీవా? మేమా?

చ॥ ''ఇరువురు వీరలేనొకఁడనే'' యని భీతిలఁ బోకుమయ్య! యొ
క్కరునొకమాటు గైకొనుము గైకొను మొక్కరు నొక్కమాటు ''ముక్
విరటునియింట బంట వయి వీఁక ననేకులతోడఁ గోతి తం''
జెబెఁగినయట్టు లోకు లను చింతయు నిట్టిది యయ్య వాసవీ

సూర్య॥ (క్రోధముతో)

గీ॥ ''గాండివం'' బనియూపయిఁ ''బాండవుఁ'' డని, పేరు చెప్పినయంత నేభీతి పుట్టె
నొక్కొ! యదియే మెచ్చుతమీ యుక్తులేల? దిగుమురణరంగమునకు, నేదిగితినిదిగో.
(నిష్క్రమించును.)

అర్జు॥ (తనలో) ఓహో! వీనికిఁగొంచెము చవిఁ జూపినన్ గాని బుద్ధికలుగదు.

అస్త్ర! గాండీవమ?

చ॥ కలన వధించి నీకు బలిగా నొనరించితిఁ బెక్కు మంది రా
జులఁ గడుఁ దృప్తి గంటి "పరిసూదన" మన్ యశమున్ వరించి తిం
కలుగఁగఁ బోకు మమ్మ? సమయ మ్మగునప్పు డజాతశత్రువా
క్కులు స్మృతికెక్కఁ జేసి యొకకొంత నను న్వెనుదీయఁ జేయుమా!

(నిష్క్రమించును)

కేతు॥ (పరికించి) ఓహో! నాయన్నయే ముందు నారాచములు విడిచినాఁడే! అరరే! అందులో నొకటి యర్జునశిరము దునుమ వలసినదే కాని యొక్కంత తప్పిపోయినది. (విని) అర్జునుఁడేమో యనుచున్నాఁడు, (తెరలో)

గీ॥ బాలకుఁడవయ్యు మెచ్చంగవచ్చు నిన్ను, నాలమింతటితో నైనఁ జాలు నడుగు
మేమి? పాత్రిణమ్ములన్న నీకింత బరువె, బ్రతుకఁజాలవె? వలవని కుతుక మేల

కేగు? అన్నదీని కేమి యుత్తరమిచ్చునో? (తెరలో)

గీ॥ "బాలకుఁడ" వంచు నన్నేల గేలిచేసె? దానవమునకు వృద్ధులకన్న బాలు
రే తగినవారు నీవిది యెఱుఁగవొక్కొ?, బాలకుఁడుగాఁడె యల్లసుభద్రికొడుకు

కేతు॥ తగినయుత్తరమునే చెప్పినాఁడు కాని యుపమానము మాత్రి మంచి జయసూచకముగా లేదు. మరల నర్జునుఁడేమోయనుచున్నాఁడు. (తెరలో)

క॥ అలసౌభద్రియనినీ. తలఁపున నెఱిఁగియుననన్నుఁ దాఁకుట మేలే?
కులమునిలుపనుంకింపుము, చలముడుగుము యజనమునకుఁ జనుదెమ్మనఘా!

కేతు॥ అక్కటా! యింత శాంతిగల మహాత్ముఁడు మును రణ మెట్లొనరించెనో? (విని) అన్న మరల నేమో యనుచున్నాఁడు. (తెరలో)

గీ॥ యజనమటులుంచు మిప్పుడీ యాజి మాఁడు, మవులఁదక్షిణకార్యమ్ములరయవచ్చు
రాచపుట్టువుఁబుట్టి నారాచమునను, కాక యుత్తర మిత్తురే! వాఁకు నోడివి.

కేతు॥ (విని) అతఁడును నారిసారించుచున్నాఁడు. బలే! యిప్పట్లనన్న యొన్నఁదగిన పని చేసినాఁడు. ఒకశరమైనను దనకుఁగాని సారథికిఁగాని రథమునకుఁగాని తగులకుండఁగ నేవారించినాఁడు. ఇఁక నిప్పుడర్జునుఁడేమి చేయునో? అదుగో ధనుస్సునకు గుఱిచూచుచున్నాఁడు. (తత్తఱపాటుతో) అప్పుడే విఱిగినదే ధనుస్సు. బలే! చచ్చినం బచ్చుఁగాక యితనితో యుద్ధ మొనర్చినదే జన్మము అన్న మఱియొక ధనువు గైకొని యమ్ములవిడుచుచున్నాఁడు.

(అంత నితనితమ్ముఁ డింకొకఁడు ధృతవర్మయనువాఁడు ప్రవేశించును.)

కేతు॥ (చూచి) తమ్ముఁడా! నీవుఁ గూడ నెందుకువచ్చితివోయి? ఇతనికి మేనమ
చాల మనియా?

ధృత॥ క॥ నరుఁ డాఁకిసమరమొనరుపఁ, గరమనురాగమ్ము గలదు గావనకొనస
త్వరమునఁ బంపుమురాచకొ, మరులకుఁబంధువులుగా సముంకృత్యంబుల్

కేతు॥ అటు మాడుము.

గీ॥ అన్న వైచిన బాణమ్ములన్ని దుంచి, యన్న రుండొక్కయమ్మునన్నఁగొట్టె

అక్కటా! అయ్యో! గీ॥ సొమ్మసిలైనతండు (ధైర్యము తెచ్చికొని) వీరణమొయ్యనరిచ్చి,
బదులు తీర్చెద నిదె పోయి పార్థు నడఁచి. (నిష్క్రమించును.)

ధృత॥ ఓహో! ఏమి? యీయుద్ధచమత్కారము

ఉ॥ ఒకరు నిగిడ్చుబాణముల నొండొక రంతరమంద దుంచుచుక్
బ్రికటనఁ జేయఁ బూనిరి స్వబాహుపరాక్రమము ల్, క్రమమ్ముగా
సుకరము గాక యుద్ధ మిది సూడ భరమ్ముగఁ దోఁచె నన్న యిం
తకుఁబయిచేయియయ్యె నిఁకఁ "దప్పనిదేజయ" మంచు నెంచెదన్.

పార్థుఁడు శరములు విడుచుట గట్టిపెట్టి యేమో యనుచున్నాఁడు. (తెరలో)

అ॥ వె॥ అన్న పాటుఁజూచి తాతఁ జెప్పటికిని, మూర్ఛ దెలియఁడయ్యె మగ్గమతివి
గాకు, మింక నైనఁగౌంతేయుజన్నమ్ము, చూడదమ్ము బవర మేడ! పొమ్ము.

ధృత॥ అన్న తగిన యుత్తరమును జెప్పకపోఁడు.

(తెరలో) జన్నమా? చూచెడిది బన్నమా?

గీ॥ బవరము నొనర్పపట్ల నెవ్వరికినేని, మూర్ఛవచ్చుట యంతతప్పుగ గణింప
రంతమాత్రన జయమంది నట్టులాత్మ, సంతసించుటమాత్ర మొకింతతప్పు.

ధృత॥ పార్థుఁడు మరల నేమోయనుచున్నాఁడు!

(తెరలో) తే॥గీ॥ "తాత తండ్రులు నాఁటి యుద్ధమునఁ జచ్చి"
రనెడిపౌరుషమును మాను మయ్య! వారి
కన్న నధికుండ వెందును గావు నీవు,
ఇంతకును దగ్గకారణ మేని లేదు!

ధృత॥ (చూచి) అన్న యాతనిమాట వినిపించుకొనకయే శరపరంపరలు నిగుడ్చు
చున్నాఁడు. అదుగో, అతఁడును మొదలుపెట్టినాఁడు. (సంతోషముతో)

గీ॥ అన్న బాణమ్ము ఫాలమ్మునందుఁ దాఁకి, పార్థుఁ డొక్కింత కనలి విస్ఫార ఘోర
శర మొకంటను నరదమ్ముఁ జక్కడంచె, సారథిని గూల్చె వేఱొక్క శరము నించి.

అదుగో! అన్న యనేక బాణమ్ముల నొక్కుమ్మడిగాఁ బ్రయోగించి యతని జీకాకు పఱచుచున్నాఁడు, అయ్యో! పాపము! అర్జుని ధనుస్సు చేతినుండి జాఱి క్రిందఁ బడినది. ఇతఁడు మునుపటి యర్జునుఁడు కానట్లు తోఁచుచున్నాఁడు ఇదే మనకు జయము రాఁదగిన సమయము గానున్నది. పార్థుఁడు మరల ధనువుగొని రథము పైకిఁ జనుచున్నాఁడు! (ప్రక్కగా దృష్టినిగుడ్చి) అదుగో! సమయమునకు మన యమాత్యుఁడు గూడ వచ్చుచున్నాఁడు. (మంత్రి ప్రవేశించును.)

మంత్రి॥ కుమారా! తుదకు యుద్ధమే స్థిరమైనదేమి? సంధి కుదురలేదా! ఆయన తనంతఁ దాను సంధికి వచ్చినపుడు మనమెందుల కొప్పఁ గూడదు?

ధృత॥ ఆ॥ వె॥ చనునె? చంకదుష్టుల శరణార్థితో సంధి, యన్నయాజ్ఞ యుంటె యాగమంట!
కరుణ నిట్టులంట గాని యుద్ధమునకు, జంకెడంట! యెట్లు సంధి పొసఁగు?

మంత్రి॥ (చూచి) కుమారా! అటు చూడుము. నీయన్న రథముపై మూర్ఛిల్లి యొరగుచున్నాఁడు.

ధృత॥ (తత్తఱముతో) ఇదె నేను వచ్చుచున్నాను. నిలువుము. నిలువుము. (పోఁబోవును)

మంత్రి॥ (చేయిపట్టుకొని) అరుగవచ్చును గాని నామాట మాత్ర మొకటి వినుము.

ఉ॥ క్రీడి యనంగ లోకములు కేవల మొక్కట నెత్తివచ్చినన్
బాడి యొకింత తప్పక యభస్త్ర మొనర్పఁగ జాలువాఁడు మీ
కోడుట తప్పగా దతని కున్నతిరోపయి పెచ్చు, నిల్పి పో
రాడితి రిఁకఁ దప్పు, చనదా! యిఁకనైనను సంధి సేయుటన్

ధృత॥ నీమాటలు! నాకిప్పుడు చెవి కెక్కవు. (నిష్క్రమించును.)

మంత్రి॥ (విని) పాపము! అర్జునుఁడును నావలెనే బోధించుచున్నాఁడే! (తెరలో)

తే॥ గీ॥ రాచపుట్టువు పుట్టినరాణ కింత, పట్టుపోరాడితిరి మెచ్చ వచ్చు మిమ్ము
నందులో నీదు సాహస మద్భుతంబు, చిన్నతనమయ్యు ననికి వచ్చితివి కడఁగి.

నీవు మా త్రిగర్తకులమునకు వన్నె దెచ్చితివి, సంతసించితిని. మీయన్నల నేద దేర్చి యింకనైన బవరం బుడుగుము.

మంత్రి॥ (చూచి) ఆమాటలు వినిపించుకొనకయే ప్రావృడ్జలధరమ్ము పగిది శరము

ఱుఱుము నిగుడ్చుచున్నాఁడు. పాపము! అర్జునుఁ డెంతకరుణాశాలియో గాని యాబాణములు వారించుకొనుటయే తప్ప నొకశరమున నేని యితనిం గొట్టకున్నాఁడు. కాని రథమును మాత్రము నుఱుము చేసినాఁడు. అక్కటా! యిప్పుడైనను జాలించిన బాగుండును గదా!

క॥ అడిదముఁబలకయుఁ గొని బిగు, వెడలకయ్యనఘుమీఁదనితఁడేగఁగఁ
వ్వడి చిఱునగవడరఁగఁజే, యొరసి తటాలునను బట్టియును దిగఁడుకటా!

ఇక్కడికే తీసికొని వచ్చుచున్నాఁడు (ఇరువురును బ్రవేశింతురు.)

మంత్రి॥ (వినయముతో) ఆర్యా! నమస్కారము. ఈశిశువును మీరు బ్రతికించితిరి.

అర్జు॥ (నవ్వుచు) ఏమోయి! త్రిగర్తవంశాభరణమా! ఇంక నేని యశ్వమును వదలి తప్పక నీయన్నలతోఁ గూడిమాయన్నగారి జన్నమునకు వచ్చెదవుకదా?

ధృత॥ (సిగ్గుతోఁ దలయూఁపుచున్నాఁడు.)

అర్జు॥ మీ రిరువురును బోయి మూర్ఛ మునిఁగి యున్న రాకొమరుల సేదదీర్పుఁడు.

(మంత్రియును ధృతవర్మయును నిష్క్రమింతురు.)

అర్జు॥ (పరికించి) అదుగో! యశ్వమప్పుడే ముందువోవుచున్నది. నేనుఁగూడఁబోవలయును. ఇఁక ముందుఁ బ్రాగ్జ్యోతిషపురమ్ము సమీపించఁ గలదు. అయ్యెడ భగదత్తునిపుత్రుఁ డగువజ్రదత్తుండు తండ్రివలని వైరమ్మున నడ్డు రావచ్చును. (పరిక్రమింతురు.) (వజ్రదత్తుఁడు ప్రవేశించును.)

వజ్ర॥ (సంరంభముతో)

గీ॥ అడ్డగింపుఁడు గుఱ్ఱమల్లదిగో! పోవు, చున్న యదికట్టి పెట్టుఁడేనుక్కడంతు
వాసవుఁడువచ్చె నేని, యవ్వాసవాత్మ, జుఁడు లెక్కయె సందియ మొందవలదు.

అర్జు॥ రాజపుత్రా! నీకు శౌర్య మనాదిసిద్ధమే కాని నామాట యొకటి వినుము.

క॥ "ఇదివఱకె రాజులెల్లరు, చదిసిరి యెవ్వారినేనిఁ జంపవలదు పి
ల్వదగుఁగ జన్నమున" కం, చు దయామతియన్న చెప్పెఁజూ నాకనఘా.

వజ్ర॥ (గర్వముతో) మీయన్న నీకట్లానతిచ్చినది నిజమేయయి యుండును కాని,

ఉ॥ ఏనయి రాఁగ నుంటి మిము నెల్లర నెక్కటి పోరఁ ద్రుంప నీ
వే నను జేర వచ్చితివి వెఱ్ఱిని? నిన్నిఁకఁ బోవనిత్తునే?
మానము గల్గి నిల్వుము మాజనకుం డతివృద్ధుఁ డౌటచేఁ
బ్రాణము గోలుపోయె నదు లప్పటి కిప్పుడు తీర్చి పుచ్చెదన్.

అర్జు॥ (తనలో) కొంతవఱకు రణము నడచినపిమ్మటఁ గాని మన సామర్థ్యము లితని కెక్కవు. అందులో నితఁడు సామాన్యుఁడా? నరకాసురుని మనుమఁడు. (ప్రకాశము)

తే॥గీ॥ "అనికిరమ్మంటి" వచ్చెదనంటి కాని, నిన్నుఁ బంపుట కాజ్ఞ యీయన్న యిడఁడు
ఎందుకిట్టి వృథారణ మెవరు మెత్తు? రశ్వమునువీడి యరుగుమా? యవలకనఘ

వజ్రి॥ (గర్వముతో)

తే॥గీ॥ వట్టిమాటలఁ బోయెడివాఁడు గాఁడు, వజ్రదత్తుండు నిన్నుఁ జావఁగనడంచుఁ
దోడు లేకుండవచ్చితి తోయజాక్షుఁ, బిలువనంపుమ? యిరువురఁ బిలుకుమార్తు.

అర్జు॥ (పరిహాసముగా) తోయజాక్షు నెదిర్చిన నీతాతగారిగతి నీ వెఱిఁగినదే కదా! వృథాగర్వాలాపము లెందుకు? నామాటవినుము.

వజ్రి॥ మొట్టమొదటఁ గేవలము గర్వాలాపములుగదోఁచినను ననుభవకాలమ్మున నిక్కుపువిలాపములుగాఁ గనుపట్టును లే? రణరంగమునకవతరింపుము.

అర్జు॥ (తనలో) ఓహో! వీనికిఁ బట్టుదల గట్టిగానున్నదే. కానిమ్ము క్రమముగాఁ దక్కక పోవునా? (ఆకాశమువంకఁ జూచి) ఓయంబరవరులార!

చ॥ కనుఁగొనుఁడయ్య మీ రిపుడు గాండివిసేఁత, కృపారసమ్ముమై
విని చెడుపల్కు లన్నియును వీటికిఁ బుచ్చి యితండు తానయై
చెనఁకుచు నున్నవాఁ డొకటఁ జే యెటు జాఱునో? యేమి యౌనొ? యీ
వ్యనికిని హాని నాకతన వాటిలకుండెడిఁగాక మీకృపన్.

(గంధర్వుడు ప్రవేశించును) (ఇరువురును నిష్క్రమింతురు)

గంధ॥ (తనలో) భారత యుద్ధానంతరమున నేఁటికి మరలఁ దగినవానితో నర్జునుని యుద్ధము చూచుట తటస్థించినది. (చూచి) అదుగో వజ్రదత్తుఁడైరావతము ననుకరించు నేనుఁగుపైనుండి యస్త్రములు విడుచుచున్నాఁడు. అర్జునుఁడు వాని నెల్ల నవలీలగాఁ ద్రుంచుచున్నాఁడు. (పెదవివిఱిచి) ఇతని సంరంభమే కాని యతని సంరంభము లేశమును గానరాదు. కాకున్నఁ బార్థునికిది యొక లక్ష్యమా? అరరే! యేనుఁగు నర్జునునరదముపై కెట్లు తోలుచున్నాఁడో! అక్కటా! యేనుఁగు పీనుఁగైనదే! (పరిశీలించి)

క॥ గదకేలఁ బూనికడుదు, ర్మదమున భగదత్తసుతుఁడు మండలగతులన్
బొదలుచుపై కవు నరునియు, రదముపయికి దుముకునదిగో, రథసమ్ముఖరన్

ఓహో! గాండీవి గదకూడఁ జూర్ణము చేసినాఁడు పాపము! వజ్రదత్తుఁడు నిరాయుధుఁడై యతఁ డింతకు మున్న విడిచిన యంపగముల వారించను పాయము తేక కాఁబోలును. వెనుకకు జరుగుచున్నాఁడు. (సంతోషముతో) సెబాసురా! రాచకొడుకా!

క॥ "వెన్నిచ్చినచోఁ దప్పిద"మన్న భయమ్మునఁ బిఱిందికటు చనుచును నీ
వన్నరు మొగంబుపై దృష్టి న్నిగుడుచునుంటి నీదు చేవ యలంతియే.

ఆహా! కరుణాశాలి యగునర్జునుఁడు శరప్రయోగమ్ము చాలించి యితని వెనువెంట వచ్చుచున్నాఁడు. (ఇరువురును యథోక్తముగాఁ బ్రవేశింతురు.)

అర్జు॥ (గౌరవముతో) కుమారా! నీసాహసము శ్లాఘ్యమైనది.

క॥ చనుదేవలెఁ జామ్మా? నీ,యనుగులుఁజుట్టములు నీవు నందఱు సవనం
బునకుఁ వచ్చెడిపున్నమ, దనమున కటనుండ వలె విధిగ రాజమణీ!

వజ్ర॥ (సిగ్గుతో) మీయాజ్ఞ శిరసావహించుచున్నాఁడను,

గంధ॥ (తనలో) మరల నేదేనిఁ దగినయుద్ధము తటస్థించినప్పుడు రావచ్చును. ఇక నెందుకు? (నిష్క్రమించును)

అర్జు॥ (చూచి) అప్పుడే అశ్వము ముందరుగుచున్నది. ఇఁక సింధుదేశము సమీపము గును. అచ్చట నాతోఁ బుట్టువు దుస్సలకొడుకుండును. అతఁడు గూడ నశ్వము నడ్డుపెట్టునా? దుస్సల యట్టిపని కొప్పికొనఁగూడదు. (పరిక్రమించును) అప్పుడే వచ్చితిమి. అదుగో! సింధునది. (తెరలో)

క॥ పోనీకుఁ డశ్వమును రా, ట్సూనుఁడు లేకున్న కొమువఁచొప్పడకుండం
గానేగి పట్టు డమరే, శానతనూజుండు మనకు శత్రుండు కదా!

(సంశయముతో) రాజపుత్రుఁడు లేకపోవుట యెందు చేతనో? వీరలెవరై యుందురో? రాజబంధువులై యుండ నోపుదురు. అక్కటా! దుస్సల కింతటిలో నీదుఃఖ మెట్లు దటస్థించెనో? (దుస్సల మనుమని నెత్తుకొని ప్రవేశించును.)

దుస్స॥ అన్నా! అర్జునా! యీపసిబాలుని రక్షింపుము. రక్షింపుము.

అర్జు॥ (కౌగిలించుకొని) అక్కా! నీకొడు కేమాయె?

దుస్స॥ (దుఃఖముతో) ఏమి చెప్పుదును. "నీ వశ్వము వెంట వచ్చుచుంటి" వనువార్త నింతకుఁ బూర్వమే చారులవలన విని బెంగ బెట్టుకొని నే నెంత బోధించినను నమ్మఁజాలక, తుదకు మరణించెను.

అర్జు॥ (విచారముతో)

చ॥ కటకట! రాచపుట్టు విది కాల్పనె? పేర్చినమూర్ఖ బ్రాహ్మణ మూ
ఢ్యుట ఘటియించుపాతకునిఁ జూచుట కెవ్వఁడు కోరుకుండు! న
క్కటికము లేనిపుట్టువులకన్నఁ బిశాచము మేలుగాదె? యే
మిటికి భయంబు చెందెఁ? దనమీఁదికి నేనని కుత్సహింతు నే.

ఒక్కతనమీఁదికే గాదు, "రాచనిసువులజోలి కించుకయుఁ బోకయే యశ్వ
మును దిప్పుకొనిర" మ్మనికదా! యన్న యాజ్ఞాపించినాఁడు. నా రాక చెప్పి
నవారలీమాట గూడ నెందుకుఁ జెప్పరైరో.

దుస్స॥ ఒకరెందుకుఁ జెప్పవలెను? నేను "నీకించుకయు భయము లే" దని చెప్పితిని. కాని, తండ్రియవస్థ దలఁచుకొని భీతిల్లి పుట్టుకునగు నన్నుఁ బుత్రికోత్కా లోనుంచినాఁడు

అర్జు॥ అక్కా! విచారింపకుము. గతించినదానికేమి చేయఁగలము? (పిల్లవానినెత్తికొని) తండ్రీ! నీవు దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము. (దుస్సలనుద్దేశించి)

తే॥ గీ॥ అన్న కావింపనున్నాఁడు యాగమొకటి, రమ్ము మనుమనితోడ నీరాక కెదురు
చూచుచుందును మా నెదునున్న మాకు, లేరు నీకన్న నక్క సెల్లెండ్రివేలు.

దుస్స॥ తప్పక వచ్చెదను. అన్నా! తల్లిదండ్రులకుఁ గుశలమకద!

అర్జు॥ ఆ! క్షేమముగానున్నారు నీరాకకు వారును నెదురుచూచుచుందురు, ఇఁక నీ
వింటికి నరుగుము. (దుస్సల మనుమనితో నిష్క్రమించును.)

అర్జు॥ (చూచి) అప్పుడే అశ్వము ముందుఁ బోవుచున్నది. ఇటుపైని గొన్ని దేశములు తిరిగినపిదపఁ బాండ్యదేశము తటస్థించును. అచ్చటి మణిపూరపురము నాప్రియురాలగు చిత్రాంగద పుట్టినిల్లు.

తే॥గీ॥ పెండ్లి యాడితి నప్పుడు పేర్మికొలఁది
మరల నొకపరి యేనియు నరయ నైతిఁ
దరుణి నన్నెంత దూఱునో? తనయుఁ డేమి
యయ్యెనో? యెటులుండెనో? యరయఁబడదు.

కానిమ్ము. అశ్వముం గలిసి కొనియెద. (నిష్క్రమించును)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బగు పాండవాశ్వమేధమ్మునందుఁ
బంచమాంకము.



# పాండవాశ్వమేధము.

(షష్ఠాంకము.)

(నాంది)

తే॥గీ॥ ఆర్తుల కెవండుసంజీవనౌషధంబు, కల్పపాదపమెవఁడు భక్తగణములకు
శివనిమాయదురూహామాయీశ్వరుండు, శుభములిడుఁగనాటకసూత్రధారి.

సూత్రి॥ (నాంద్యంతమునఁ బ్రవేశించి) మారిష! ఇటురమ్ము.

మారి॥ ఇదె వచ్చితిని.

సూత్రి॥ "నాటక మాడుఁ"డని యాజ్ఞాపించియు, ధర్మరాజుగారిప్పటికిని సభకు విచ్చేయనిహేతు వేమో?

మారి॥ "తమ్ములయొద్దనుండి వార్తాహరులేని రారే" దని యోజించుచున్నారఁట. అక్కట తనవేకదా! కాలయాపనకయి మనలం బిలిపించుట.

సూత్ర॥ (దృష్టినిగుడ్చి) అదుగో! రాజుగారు దయచేసినారు. మన మిఁక నాటక మారంభింతము. (అంత ముగ్గురుతమ్ములతో ద్రౌపదీసమేతముగ ధర్మరాజు ప్రవేశించును.)

మారి॥ ఈనాఁడు మన మేనాటకము ప్రదర్శింపుదము?

సూత్రి॥ ప్రకృతోచిత మగుబభ్రువాహనవిజయము.

మారి॥ చక్కఁగా యోజించినావు కాని యీకతమున వారిమనస్సునకు నొప్పికలుగు నేమో?

సూత్ర॥ "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్" కనుక బభ్రువాహనునిచే నర్జునుఁడు జయింపఁబడుటకు వారానందమునే పొందుదురు (తెరలో)

నిటలఘటితాంజలిపుటుండ నై యేను మాతండ్రిదర్శనమునకుఁ బోవుచుండ నసంబద్ధప్రలాపము లాడుచున్నారేమి?

మారి॥ (విని అర్జునిదర్శనమునకు బభ్రువాహనుఁడు వచ్చుచున్నాఁడు గాన మనమిఁకఁ బోవుదము. నిష్క్రమింతురు.) ప్రస్తావన.

(అంత నర్జునుఁడును బభ్రువాహనుఁడును వేఱువేఱువైపులను బ్రవేశింతురు.)

బభ్రు॥ మా పెద్దతండ్రిగా రశ్వమేధయాగదీక్షితులై యశ్వమువెంట మాతండ్రిగారినని పిరనియు "వారు మా పురముసమీపమునకు వచ్చి" రనియును వింటేఁ గావున నెదు రేఁగి వారిని బురంబునకుఁదీసికొనివచ్చి సన్మానించి జన్మమును గృతార్థముగాఁ జేసికొనియెద. (పరిక్రమించి) అదుగో! తండ్రిగారు. (సమీపించి)

చ॥ తనయుఁడ బభ్రువాహనుఁడ దండ్రి! భవచ్చరణాబ్జదర్శనం
బునఁ గృతినైతి మజ్జననము న్గడుసార్థతఁ గాంచెఁ బట్టణం
బున కొకసారి వచ్చి పరిపూత మొనర్పఁగ వేఁడుకొందు మజ్జ
నని యిటుల్ నను బనిచె సర్వము విన్నప మాచరించితిన్,

అల్ల దేయమాత్యపురోహితసామంతాదు లందఱును దమరాకకై యెదురుచూచుచున్నారు. కృపావలోకనంబుల వారల నెల్ల నీక్షింపఁగోరెద.

ద్రౌప॥ (తనలో) మూఁడు మహారథుల నితఁడు నిజముగాఁ బాండవమధ్యముని వలెనె యున్నాఁడు. నాటకమైనను వేషము లిట్లుండిన నది రమణీయముగ నుండును.

ధర్మ॥ (తనలో) ఓహో! తమ్ముఁడా! నిన్నుఁ జూచి యెంతకాలమైనదోయి! నేఁటి కీనాటకులకతన మరల నినుఁ జూడఁ గల్గెను.

భీము॥ (తనలో) ఇతఁడా? బభ్రువాహనుఁడు, తమ్మునికి నితనికిని భేదమే కనుపట్టదు

నకు॥ (తనలో) ఇందుల కన్న యేమని యుత్తర మిచ్చునో?

సహ॥ (తనలో) కొమరుఁడు వచ్చి నమస్కరించినఁ గౌఁగిలించుకొని గౌరవింపక యేమో కోపముగా నుత్తర మిచ్చుచున్నాఁడు

అర్జు॥ (అనాదరముతో)

ఉ॥ "నాకొమరుండ" వంచు నెటు నమ్ముదు? నశ్వముఁ గట్టి పెట్టితో?
వీఁక నెదిర్చితో? యిదియు నిం దగునే? నరపాలమూర్తి, కీ
రాక గనుంగొనంగ నిను "రాకొమరుండ" వటన్న మాటకే
లోకము విశ్వసింప దెటులో యిఁక "నాకొమరుండ" వన్నచోన్.

ధర్మ॥ దేవీ! చూచితివా? తమ్మునియవివేకము, నేను జెప్పినసంగతులు మఱచినట్లున్నాఁడు. తనంతటఁ దానే కయ్యమునకు దిగుచున్నాఁడు.

ద్రౌప॥ నాథా! ఇది నాటకము గదా? కవులు వారివారియిష్టానుసారముగాఁ గల్పింతురు.

భీమ॥ అవును. నీవనినట్లే, లేనిచో నిట్టివిరుద్ధముగా నతఁడెన్నఁడును మాటలాడఁడు.

బభ్రు॥ (చిన్నవోయి తనలో) అక్కటా! లోకోత్తరుఁడైనవివేకి తండ్రి యేమికతమున నిట్లాడి యుండునో? నే నెంతసంతోషమ్మున నిక్కడికి వచ్చితినో అంతవిచారముగాఁ బోవలసినవాఁడ నైతిని, కానిమ్ము. ఏమైనను జనకునితో వివాదము సమంజసము గాదు.

క॥ "జనకునికి విరోధించిన, తనయుఁడు తనయుండుగాఁడు తల్లికిఁ దప్పు
త్రినికతన సతిమణిగాఁ, దను నపయశమబ్బు" నందు రమలమనీషుల్.

ఇంతకు నన్నీయనఘుఁడు మాతామహకుటుంబమునకిచ్చి వేయుటం బట్టియుఁ బుట్టినది మొదలిందఁకఁ జూడకుంటం బట్టియుఁ బ్రేమబంధము తెగి యుండును. "స్నేహము ప్రవాసాశ్రయమున నశించు" నని కదా? పెద్దలు చెప్పుదురు. (మరలిపోవుచు) తల్లికడ కరిగి ఆపె యేమనునో చూచికాని యిందుల కను స్వతంత్రింపఁ గూడదు.

తే॥ గీ॥ గర్భమునఁ బదిమాసముల్ కష్టమనక, తన్ను ధరియించిమోసియంతట నఖండ
మైనవేదనఁ బ్రసవించినట్టితల్లి, జనకుకన్నను హెచ్చగు శతగుణంబు.

ధర్మ॥ పాపము! తలవంచుకొని మరలి పోవుచున్నాఁడు, (అతనినుద్దేశించి) తండ్రీ! కురుకులోద్భవుండవగు నీ కిదియే యుచితము. ఎవ్వరో యొక్కరు దక్క మనవంశమున నవినీతు లిప్పటికి జనింపలేదు.

ద్రౌప॥ ఇది నాటకము. అటు చూడుఁడు, ఒక నాగకన్యక ప్రవేశించుచున్నది.

(అంత నులూపి పాతాళమునుండి ప్రవేశించును.)

భీమ॥ ఈమె యెవరో?

నకు॥ చిత్రాంగద యేమో

సహ॥ చిత్రాంగద నాగకన్యగాదు గదా? తినఁబోవుచు రుచులెందుకు? ముందు తేల వచ్చును.

ఉలూ॥ కుమారా! యిట్లు విషణ్ణమానసుండవై యేగుచుంటివేమి? నీతల్లిమాత్రము నిన్ను "రణము గాను" మను ననుకొంటివా? తండ్రి మనోరథమ్ము నెఱవేర్చుము. శూరులకుఁ "దండ్రియుఁ గొడుకును నన్నయుఁదమ్ముఁడు" నను

భేదముండదు. అందులోఁ బాండువంశసంజాతులకు బొత్తిగా గాంధర్వ మని వార్యము.

ధర్మ॥ ఈమె యెవరో? గాని మంచినీతియే బోధించుచున్నదే. అకటా! నాకీన వంశమున కట్టిదుష్కీర్తివచ్చినది. దేవి! చిగురుమాట నీవు వింటివి కదా!

ద్రౌప॥ నాటకము కదా, దీనిని మన మంత లెక్కగాఁ జూచుకో రాదు.

ధర్మ॥ ఎందుకుఁ జూచుకోఁ గూడదు? ఇం దసత్య మేమున్నది? నేను బంధుఘాతుకుఁడను గానా యేమి?

ద్రౌప॥ ఆగుదురు. కారు, దాని కేమి? అటుచూడుఁడు

బభ్రు॥ (తనలో) ఎవ రీమె? ఇంతకును నాలో నే ననుకొన్న సంగతు లెల్లఁ గుఱుతించినది. (ప్రకాశము) తల్లీ! ముందునీ వెవ్వరవో? నాకాన తీయవలయు

తే॥ గీ॥ కార్తికేయునిజననివో? కాశమన్మ, థాంబవో? జయంతుతల్లివో? ముల్లసప్త
ఋషులమాతవో? త్రిజగమ్ము లెల్లఁగనిన! యాదిశక్తివో? వచియింపుమమ్మ నాకు

భీమ॥ అడుగఁ దగినసంగతి నడిగినాఁడు.

నకు॥ ఇంతకు నీమె "యితనితల్లి మాత్రము గా" దని తేలినది.

సహ॥ అంతయు నిప్పుడు విస్పష్టమగును.

ఉలూ॥ తండ్రీ! నీకు నేను పెద్ద తల్లినగుదును, మీయమ్మకన్న మున్న మీతండ్రి నన్ను గాంధర్వవివాహమున వరియించె, నా పే రులూపి, పాతాళము నివాసము, నాగకన్యకను, నీ వియ్యెడఁ దల్లివెనుక తల్లి నగునామాట విశ్వసింపుము. తండ్రిమనోరథం బీడేర్పుము.

సహ॥ ఇక్కడితోఁ దేలినది కదా?

నకు॥ పథూనికా! నమస్కారము.

భీమ॥ ఇది నాటకము.

ద్రౌప॥ (నవ్వుచు) నాథా? మీతమ్మునికీ దీర్ఘయాత్ర బహుసిద్ధితో జరిగినదినుఁడీ?

ధర్మ॥ (అనాకర్ణితముగా) ఈమెయాకారము చూచినఁ బరమపతివ్రతవలెఁ బొడకట్టుచున్నది. ఇంతకు మున్ను వినికియు నిందుకు భిన్నముగా లేదు. అట్టి యీమెయేలాకో? యిప్పట్ల నిట్టినరుపదేశంబొనరించి కుమారుని మనముఁద్రిప్పుచున్నది.

ద్రౌప॥ దురుపదేశ మేమి? ''తండ్రియాజ్ఞను శిరసావహింపు'' మని బోధించుచున్నది

ధర్మ॥ నీవు పక్షపాతముగాఁ జెప్పుచున్నావు. ''చెల్లెలుగదా!'' యని చెల్లెలిమాట సాధించుట నిష్పక్షపాతముగలవారల కుచితమా?

ద్రౌప॥ (నవ్వి) ఇంతకు నిది నాటకము కదా!

ధర్మ॥ నామనమునకు నిది నాటక మనిపింప కున్నయది.

ద్రౌప॥ కా కేమి యటుచూడుఁడు.

బభ్రు॥ (తనలో) ఈసంగతి తల్లికతన మున్న విని యున్నదే, ఇంతకు మాయిరువురకును రణము దైవచోదితమై యున్నది. లేనిచో నీపె కాకతాళీయముగా నిచ్చోటకు వచ్చి యిట్లేల బోధించును. (ప్రకాశము) తప్పక నీయాజ్ఞ నిర్వర్తింతును.

ఉలూ॥ నాయాజ్ఞ గాదు! తండ్రియాజ్ఞ.

బభ్రు॥ ఉభయులును మాన్యులే కదా, ఇదిగో యుద్ధసన్నద్ధుండనై యరుదెంచెదను. (నిష్క్రమించును)

ధర్మ॥ (తనలో) ఇది యుచితము గా'' దని తమ్మునితో బోధింపుదునా? లేనిచో నేమిచిక్కు వచ్చునో? అయినను గొంతసేపు మాచి యట్లొనరింప వచ్చును.

ఉలూ॥ (తనలో) అకృత్యమైనను నవసరముం బట్టి చేయఁబూనినందులకీ కొక్కమరుం డంగీకరించెను. లేనిచో నిమ్మహానుభావునికి భీష్మవధజనితదోషంబు వేయిజన్మంబు లనుభవించినను దీఱదు. ఇంతకు వసువు లనుగ్రహించి యిట్టి యుపాయ మొనరించినారు. (పరిక్రమించి) అదుగో! నాప్రియుఁడు, తిరిగియు నెన్నాళ్ళకీతనిదర్శనమునకు నోఁచికొంటిని, ఇంతకు నాచేపట్టినది మొదలేదియో యొక చిక్కు మహామహునికిఁ దటస్థించుచునే యున్నది. నేను దురదృష్టవంతురాలను. అంతియ కా దిప్పుడు పరమ దుర్మార్గురాలనుగూడ నగుచున్నాను. గానిచోఁ దండ్రికిని గొమరునకును వైరము పెట్టుదునా? చిత్తమా! యొక్కింతసేపు కాఠిన్య మవలంబింపుము లేనిచోఁ గార్యము నెఱవేఱదు.

భీమ॥ అదుగో! కుమారుఁడు సన్నద్ధుండై వచ్చినాఁడు. (బభ్రువాహనుఁడు ప్రవేశించును.)

నకు॥ ఇతడు మరల రెండవయభిమన్యుఁడే.

సహా॥ ఏమో? వినయముగాఁ జెప్పుచున్నాఁడు.

బభ్రు॥ చ॥ కనుఁగొను మయ్య తండ్రి! యిఁక గాండివముక్ సగుణం బొనర్చు "నీ
యనుమతి యే ప్రధాన" మని యాహవముక్ బొనరింప వచ్చినాఁ
డను "దనయుండు వీఁ" డను కటాక్షము చూపఁగఁ బోకు మేనుకా.
గనికర మూనఁ "దండ్రి" వని కాఁదగు నెయ్యది యా రయమ్మునన్.

ధర్మ॥ ఓహో! చిలిక చిలిక, గాలివాన యగుచున్నదే!

ద్రౌప॥ మీతమ్ముఁ డేమో యానందముతో నడుచున్నాఁడు వినుఁడు.

అర్జు॥ (సంతోషముతో) కుమార! నీ మొక్కపుడు గైకొంటిని, ఇదుగో! యాశీర్వచనము.

గీ॥ మనుము! చిత్రాంగదను వీరమాతఁ జేయుం, మెలమి మాకు యశమ్ము నగలుగఁ జేయు
మస్థిరశరీరమున కేమి యాశయు మనకు, ముఖ్యమద్దాన నీమదిమునుఁగుఁ గాక

ధర్మ॥ (తత్తఱపాటుతో) దేవీ! వింటివా? తమ్మునినోట నిప్పుడును రానిమాటలు వచ్చుచున్నవి. శరీర మస్థిర మఁట! ఇక్లెందు కనవలెను?

ద్రౌప॥ అస్థిరము కాక సుస్థిరమా! అం దేమి తప్పున్నది? శేషము వినుఁడు.

అర్జు॥ రణభూమినలంకరింపుము. ఇదె నేనువచ్చుచున్నాఁడను. (నిష్క్రమింతురు)

ధర్మ॥ పినుట కే మున్నది. రణమునకుఁ బ్రారంభించినారు, ఇదుగో నేను బోయి వారించెదను. (లేవఁబోవును.)

ద్రౌప॥ (చేయిపట్టుకొని) నాథా! యేమి మీవెఱ్ఱి? యిది నాటకము గదా!

ఉలూ॥ ఇక్కడికి నేను సగము కృతార్థురాలను, తక్కినకొదువ శీఘ్రముగనే తీఱ వచ్చును (పరికించి) కుమారుఁడు వింట నమ్ములు సంధించియును సందుల తో జాల మొనర్చుచున్నాఁడు అవును, ముందు తండ్రి విడిచినం గాని విడువఁడు. పరమపతివ్రత యగు చిత్రాంగద కును నఖండనీతిధురంధరుం డగు విజయునకు ను బొడమి కుమార్గమున నేలఁ దడుగు వెట్టునా? అదుగో నాదయితుఁడే ముందుగా నమ్ములు విడుచున్నాఁడు. అక్కటా! కన్నకొమరునిపైఁ గఱకుటమ్ములను విడుచుటకు నాథా! నీకుఁ జేతు లెట్లు వచ్చినవి. బలే! యొకరికన్న నొకరు, తండ్రికొడుకులలో నొక్కటియుఁ దక్కకుండఁగ నన్నిటిని నొక్క యమ్మునసే మార్గము చేసినాఁడు. (విని) నాథుఁ డేమో యనుచున్నాఁడు. (తెరలో)

క॥ మెచ్చితిఁగదోయి! మదికిన్, వచ్చెను నీచర్య "పాండువంశమ్మున ను
ద్యచ్ఛ్రితు రెండుఁ గల్గె"రను, నచ్చెరు విదియొనవుఁగాక యఖిలజగతికిన్.

ధర్మ॥ దేవీ! నన్నెందుకు వారించెదవు? సుతి మించుచున్నది. ఎవరో యొకరు తెగక తీర" దని యూహించెదను.

ద్రౌప॥ నాథా! "యిది నాటక" మని యెన్నిసార్లు మనవి చేసినను మీమన మిట్లు పరాయత్త మగుచున్న దేమి?

ధర్మ॥ కొలఁది దినములక్రిందట నా కొకదుస్స్వప్నము వచ్చినది. అప్పటినుండియు నామనసు మనసు గా లేదు.

ద్రౌప॥ ఇన్నాళ్ళనుండియుఁ జెప్పరైతి రేమి? దానిపర్యవసాన మెట్టిది?

ధర్మ॥ పర్యవసానము శుభము గా నుండఁ బట్టియే యింతవఱకు జీవింపఁగలిగితిని.

ద్రౌప॥ అట్లయిన వీరిఁకఁ బరితాప మెందులకు? స్వస్థచిత్తులరై కనుఁగొనుఁడు.

ఉలూ॥ (తనలో) ఈయుద్ధ మొకలాగు జరిగినచోఁ గతుకెన్నఁదగి యుండును. వీర లకుఁ బరస్పరజ్ఞాన మించుక ప్రతిబంధించుచున్నది. (చూచి) ఓహో, శుదకుఁ జూడ శక్యము గాకున్న దే? ఒకరి నొక రెట్లు కొట్టుకొనుచున్నారో! ఇట్టి లేఁక నొకక్షణకాల మున్న నొక్కరే కాదు, ఇరువురును దెగ్రృ వలసినవారే, వల దని వారింతునా, (యోజించి) అహో! మరల నజ్ఞానమునఁ బడుచున్నాను. వారించినచో ఘటించిన బాధ యేమి? సంజీవనమణి దగ్గఱనే యున్నది, భయమెందుకు? పాపము! ఈసంగతి విని చిత్రాంగద నన్నేమని నిందించునో! (అంతఁ దత్తఱపాటుతోఁ జిత్రాంగద ప్రవేశించును.)

ధర్మ॥ (చూచి) దేవీ! యిది నాటకమే యైనను నేను జూడఁజాలను. "ఇంతటితోఁ జాలింపు" మని "వారలతోఁ జెప్పు" మని భీమునికిఁ దెలియఁ జేయుము (కన్నులుమూసికొనును)

ద్రౌప॥ నాథా! మధ్య యాపించినచో రసాభాసముగ నుండును. అటు చూడుఁడు మఱియొకదివ్యసుందరవిగ్రహము గలయొలనాగ విచారించుచు వచ్చుచున్నది.

చిత్రా॥ (అర్జునుతో) తండ్రీ! తండ్రీ! యెంతటి యకృత్యము నొనరించుచున్నావు. ఈడుగుసుడుగును (రంగమునకుఁ బోవుచుండఁగా.)

ఉలూ॥ (తనలో) ఇది గొప్పయంతరాయముగాఁ దోఁచుచున్నది. ఈమె నెట్లువారింతును ఇట్లగుంగాక (చేయిపట్టుకొని) అక్కా! ఇటు చూడుము.

చిత్రా॥ (చూచి) అక్కా! నీవిక్కడ నుండియే కొమరునిదుష్కృత్యమును వారింపకుంటివా?

భీము॥ తమ్ముఁడా! ఈమె చిత్రాంగద కాఁబోలును.

నకు॥ కావచ్చును, కొమరుని వారింపుటకై పోవుచున్నది.

సహ॥ వధూనికా! నమస్కారము.

ద్రౌప॥ (నవ్వుచు) ఇది నాటకము.

ఉలూ॥ (తనలో) ఇప్పట్ల నసత్య మాడక తీరదు. (ప్రకాశము) నాయూవచ్ఛత్రిం [?] జెప్పి చూచితిని, విన్నాడు కాడు, అయిన నేమిలే. కొంతసేపటికి వారే యూరకొందురు.

ధర్మ॥ (కోపముతో) ఛీ! జాతిలక్షణము పోఁగొట్టుకొన్నావు కావు నీలోపలవిషము పెట్టికొనిపైకి తేనెమాటలు చెప్పెద వేమి? ఇదియంతయు నీవుచేసినపన్నుగడ కాదా! ఆఁడుదానవై పోతివి లేనిచో నీబ్రతు కేమి యగునో?

ద్రౌ॥ నాథా! వృథాగా నీదీనురాలిపై నెందుకుఁ గోపించెదరు!

చిత్రా॥ (తనలో) ఏమి యీమె యిట్లనుచున్నది. ఇంకేమైనఁ గపటము లేదుకదా! (ప్రకాశము) నన్నుఁ బోనిమ్ము. నేను వారించెదను.

ఉలూ॥ నీవు వృథా పరిశ్రమము పడుటయే కాని, లాభము లేదు, వినరు. ఇంతయు నియ్యది వినోదముగా నొకరికొకరు పరీక్షించుకొనుట కేర్పడిన కయ్యమే గాని మఱియొకటి కాదు, "కొమరుఁడు తనయంతవాఁడగునో కాడో" యని నాథునకు సందియము గల్గినది. అది తీఱుచున్నది.

ద్రౌప॥ (తనలో) ఈమె మొదట నుండియుఁ గుటిలముగానే వర్తించుచున్నది. నిజముగా నిట్లు జరిగెనేని యీమె యట్లాచరించుటకు గారణ మేమో?

చిత్రా॥ (చూచి) అయ్యో! అయ్యో! ఇట్టివిపరీత మెచ్చట నైనఁ గలదా? ఇది పరీక్షకేయైనచో నింతఘోరముగా నుండునా? నీ వెఱిఁగియే దాఁచుచున్నావు. నన్ను నిర్బంధింపకుము. పోనీ వినకుందురుగాక నామనోభిప్రాయ మెఱిఁగించి నాథునియెడల నిరపరాధిని నయ్యెదను నన్నుఁ బోనిమ్ము.

ధర్మ॥ (తనలో) ఈమె పోయి మధ్య నిలిచినచోఁ దప్పక వీరు రణముడుగుదురు.

ఉలూ॥ (తనలో) ఓహో! యీమె నాఁగుటదుర్ఘటము గానున్నదే! (ప్రకాశముఁ) స్త్రీలు సంగరభూమికిఁ బోవు టుచితముగాదు నామాట వినుము. (గట్టిగా బట్టుకొనియాఁపును.)

ధర్మ॥ (తనలో) ఔనా! యీభుజంగిదౌర్మార్గ్యము! ఏదో యొకయత్నము వెట్టి యామె నాఁగుచున్నది. (ప్రకాశము) సాధ్వీమణీ! యీవామగామినితో నేమి? నీవు పోయి వారింపుము.

ద్రౌప॥ నాథా! నాటక మాడునపుడు సభ్యులు మాట్లాడుట పరిహాస్యము కాదా!

చిత్రా॥ (చూచి) అయ్యోఅయ్యో! కొమరున కెట్టినారసము వెన్నుచ్చిపోయినదో? అక్కటా! ఆకోపముచేఁ గొమరుఁడర్ధచంద్రాస్త్రము ప్రయోగించుచున్నాఁడు. దైవమా! యేమి చేయుదును? కడుపు, వీపు, ఇం దెవతియాపద చూడఁగలను.

ద్రౌప॥ (తనలో) పాపము! ఇప్పుడీమె యవస్థయెట్లున్నదో?

ఉలూ॥ ఎవరికి భయములేదు. కొంచెము సేపు తాళుము.

ద్రౌప॥ (తనలో) ఈమెధైర్యమేమో? నిశ్చింతగా మాట లాడుచున్నది.

చిత్రా॥ (చూచి) అకాట! అకాట! యెంతదుర్మార్గురాలవైతివి? అదుగో! నాథుని శిరము ద్రెళ్లినది. అయ్యో! అయ్యో! (మూర్ఛిల్లును)

ధర్మ॥ (కోపశోకములతో) దేవీ! అదుగో! నన్ను వారింప నిచ్చితివి కావు తమ్ముని శిరము దెగినది అయ్యో! అయ్యో! (మూర్ఛిల్లును)

ద్రౌప॥ అయ్యో! అయ్యో! (మూర్ఛిల్లును)

నకు॥ (మూర్ఛిల్లును)

సహ॥ (మూర్ఛిల్లును)

భీమ॥ (దుఃఖముతో) అక్కటా! యిది యేమి విరుద్ధము? భీష్మద్రోణాదులతోఁ బోరునప్పుడేని నాతమ్మునికిట్టి దురవస్థ రాన్నఁడు లేదే! ఇయ్యది నిజమై యుండునా? (ధైర్యము దెచ్చుకొని) కల్పితమైయుండును. (నలుదెసలు పరికించి) ఇది యేమి వీరలందఱును మూర్ఛిల్లిరే! (అటుచూచి) ఓహో! కుమారుఁడును ద్రెళ్లినట్లున్నదే. రథముపైఁ బడి యున్నాఁడు. (యోజించి) ఇది కేవలమసత్యము. తుట్టతుదకిట్లు నాటక మెప్పుడును సమాప్తినొందఁగూడదు. వీర లిరువురును దిరిగియు బ్రదుకుట యుండవలెను. (సంశయముతో) తల

తెగినయన్న యెట్లు బ్రదుకును (కోపముతో) ఓరీ! పండితమ్మన్యా సూత్రధారా! యిట్టిదుష్టనాటకమెట్లు ప్రదర్శింపుచుంటివిరా? ఇదుగో! నీతల పగిలినది. చచ్చితివిరా, లక్షణజ్ఞానవిహీనులైనకుంతలు చెప్పిననాటకముల నాడి జగమును మోసము చేసెదవురా? దురాత్మా!

సూత్ర॥ (భయముతోఁ బ్రవేశించి) అయ్యా! సైపుఁడు వీరలిరువురు నిప్పుడే జీవింతురు. ఇది మహాలక్షణవేత్తలును ద్రికాలజ్ఞులును నగుకైలాసశిరోమణి భట్టాచార్యుల వారిచే రచింపఁ బడినది. దేవరకోపముచే మధ్య నాటకము విరస మగుచున్నది. అనుగ్రహింపవలయు.

ధర్మ॥ (మూర్ఛదెలిసి) "అదుగో! త్రికాలజ్ఞుఁ" డనుచున్నాఁడు. ఇది యిట్లు జరుగఁ బోవునని యెఱిఁగి యుండే వాల్మీకివలె వ్రాసియుండును, ఇంతకు నిది నిక్కమే. అయ్యో! అయ్యో! (స్మృతినభినయించి) గంగాశాపమువలన నిట్లు జరిగినను దిరిగియుజీవింప వచ్చును. (సూత్రధారునుద్దేశించి) ఓయీ! త్వరగా తెఱవేర్పుము. చూడఁ జాల కున్నారము.

సూత్ర॥ చిత్తము. (నిష్క్రమించును.)

భీము॥ ద్రౌపదిని దమ్ములను లేపఁ బోవును.)

ధర్మ॥ (వారించి) తమ్ముఁడా! వీరు తిరిగియుజీవించువఱకును వీరలను లేపకుము. వీరు చూడఁ జాలరు. ఇంతదనుక నాటక మనియెఱిఁగియు నిప్పుడు వీరు తన్మయులై యుందురు.

ఉలూ॥ అయ్యో! దైవమా! యెంతపనిజరిగినది! కుమారుఁడు మూర్ఛిల్లినాఁడు. నాథుఁడు తెల్లినాఁడు. అక్కటా! అక్కటా! యెంతమందభాగ్యరాలను. (స్మృతినభినయించి) నేనుగూడఁ దన్మయురాలనై విచారించుచుంటి నేమి? ఇదిసంతసింపఁ దగినయవసరమే కాని విచారింపఁ దగునవసరము కాదు. ఈయూపముగా నితనిపాపము శాంతించినది. (చిత్రాంగదం జూచి) అయ్యో! ఈమె యిప్పటికిని మూర్ఛ దెల్పియ లేదు. (ఆలోచించి) ఇదియాపె కీసమయమున నుపకారకమే. వారలం బ్రదికించి పిదప నీపెకు శీతోపచారము లొనరించెద. కానిచోఁ బతిసుతమరణమ్ములొక్కటఁ జూచి యీమె భరింప నేరదు. హృదయమా! ధైర్యమవలంబింపుము. నన్నక్కడికిరయమునఁ గొని పొమ్ము. (నిష్క్రమించును)

చిత్రా॥ (మూర్ఛదేలి) అయ్యో! అయ్యో! పితృఘాతుకుండగు కుమారునిం గన్న నాకెట్టియాపద యైనను రావచ్చును. (కన్నులువిచ్చి) అక్కటా! కుమారుఁడు గూడఁ జెల్లినాఁడు. శివశివా! పరమేశ్వరా! యెట్టియాపద దెచ్చి పెట్టితివి? (లేచి శవములదరికిఁ బోవుచు మధ్యమూర్ఛిల్లును.)

(ఆకాశమునఁ బుష్పవృష్టి, సతీసుతసమేతముగ నర్జునుఁడు ప్రవేశించును.)

ధర్మ॥ (సంతోషముతో) దేవీ! (ద్రౌపదిని లేపును)

భీమ॥ (సంతోషముతోఁ దమ్ములను లేపును.)

అర్జు॥ (ఉలూపిం జూచి తనలో) ఇట్టియుపకృతి నాచరించిన యీమెయెవరై యుండునో? (స్మృతినభినయించి) ఉలూపి కాదుగదా?

ద్రౌప॥ నాథా! వీరు మరల నెట్లు బ్రతికినారు.

ధర్మ॥ ఆనాగకన్యక యెట్లో నాని బ్రతికించినది యని యూహించెదను

నకు॥ మొదలఁ గయ్య మెందుకుఁ బెట్టవలయునో?

సహ॥ పాపము! ఆమె యేమెఱుఁగును? అన్నయే కదా! ప్రథమకారణము.

ధర్మ॥ దీని కేదోయొక కారణ ముండి తీరవలెను. ఆమెమాత్రము పరమయోగ్యురాలు.

ద్రౌప॥ మీరిందాఁక నామెను దూషితిరి కదా?

ఉలూ॥ అక్కా! చిత్రాంగదా! లెమ్ము

అర్జు॥ (తనలో) సంశయమేమి? ఈమె నిక్కముగా నులూపియే! ఇప్పటికి విస్పష్టమైనది. కానిచో "అక్కా"! యనియేల పిల్చును? అయిననుముందుఁ దేలకుండునా? గానియిక్కడి కెందులకు వచ్చినదో?

చిత్రా॥ అయ్యో! అక్కా! యెంత పనిచేసితివి. నన్నుఁ బోనీయవైతివి. దైవమా నీకు నే నేమి యపకృతి చేసితిని.

ఉలూ॥ కన్నులు తెఱవుము. అదుగో! కుమారుఁడు, ఇదుగో నాథుఁడు.

చిత్రా॥ తల్లీ! నేను జూడఁ జాల నన్ను నిర్బంధింపకుము, నాకుఁ జిరఃఛేదింపుము! నాథునిఁ గూడఁ బోయెద!

ద్రౌప॥ పాప! మీమె యింకను "వారు జీవింప రే"దనియే యనుకొనుచున్నది! అక్కటా! యిట్టికష్టము శత్రువులకైన వలదు!

ఉలూ॥ అట్లు దట్టించినచో నీవు పోవుదానవుగు నేను నిల్చుదాననా? అదుగో! సజీవులై నీయెదుట నున్న వారు విలోకింపుము!

అర్జు॥ (తనలో) నిక్కముగా నీమె యులూపియే!

చిత్రా॥ (చూచి ఆశ్చర్యముతోఁ దనలో) ఏమి యీ విచిత్రము! ఇది కలయేమో?
(సిగ్గుతో నర్జునుని నమస్కరించును)

ద్రౌప॥ ఓహో! యీమెసౌందర్య మనుపమానము కదా!

అర్జు॥ దేవీ!

తే॥గీ॥ వీరమాతవై యొక్కఁడు పేరు దెచ్చి, నట్టినీ కేమి దీవన యాచరింతు
నిన్నుఁ బెండ్లాడు ఫలమునందితిని నేను, సతికి తనఁగాదె! యశమయశమును బతికి.

ఉలూ॥ (సిగ్గుతో నమస్కరించి) నాథా! ఈతప్పంతయు నాది నన్ను క్షమింపుము

అర్జు॥ (తనలో) ఏలాగో! యీమె పరమోపకారిణి యయ్యు నిట్లు నొడువుచున్నది.
(ప్రకాశము) ఇందు నీయపరాధమే మున్నది. అంతయు నాదే.

బభ్రు॥ (తనలో) ఈమె నన్నుఁ బ్రేరేపుట కేదో హేతు వుండవలెను

చిత్రా॥ మిమ్ము నిరువుర వారింపఁ బోయెడి నన్ను "నియ్యది కలహము గాదు, వినోదము" అని చెప్పి యాఁపినది.

అర్జు॥ (ఉలూపిం జూచి) చెలీ! అందుకా! నీ విట్లు సంశయించుట. అట్టియెడ నెవరడ్డమైనను లాభములేదు. అది గాక వీరపత్నులకును, వీరమాతలకును నది సమంజసము గాదు.

ఉలూ॥ నాయపరాధ మంతమాత్రమే గాదు, ఇతఁడు "తండ్రితో సంగర మొనర్చుట బొత్తిగా పాడి గా" దని మరలి పోవుచుండ నేఁ బురికొల్పితి.

ద్రౌప॥ ఎందులకుఁ బురికొల్పితివో? అదియే తెల వలసి యున్నది.

అర్జు॥ మంచి పని చేసితివి. వీరమాతలలో నగ్రగణ్యురాలవైతివి, కావున నే.

క॥ నీకొమరుఁ డిరావంతుఁడ, నేకానీకముల ననిజయించి తుదకు నె
న్నికసమరాంగణమ్మున, నేకాయము విడిచి స్వర్గమేగె మృగాక్షీ.

ధర్మ॥ అయ్యో! వెఱ్ఱితమ్ముఁడా! యిప్పుడీమెకు మరల నాసంగతి యెందులకు స్మృతిఁ దెచ్చితివి.

ఉలూ॥ (కన్నీరు నించును.)

చిత్రా॥ అక్కా! యీయుసిల్లుము, రాచకొడుకుల కిది యుచితమే కదా!

అర్జు॥ దేవీ! నాగరాజనందని!

క॥ ఏరికని విచారింపుదు, మోరాజీవాక్షి కౌరవులొక్కటఁ దెగి కీ
భారతరణమున నిది భూ, భారతరణమగుటనట్లు పనుపడె నబలా.

ద్రౌప॥ అక్కా! యైదుగురుకొమరులను నేనుమింగితిని, ఏమిచేయుదు, ఊఁఊడిల్లుము (కన్నీరువిడును)

ధర్మ॥ దేవీ? యూఁఊడిల్లకు.

చిత్రా॥ ఆయనకుమాత్రము కొమరుఁడు గాఁడా? విచారములేకపోవునా? శోకించిన ఫలితమేమి? ఊఁఊడిల్లకుము (కన్నీరుదుడుచును)

ఉలూ॥ అక్కా! తండ్రికిని గొడుకునకును గలహము పెంచెడిపాపజాతికి నాకట్టి కొడు కందుకు దక్కెను.

చిత్రా॥ "పరమయోగ్యురాల వగునీవుమిన్నక యిట్టిపని నాచరింతు" వనిన నా మది నమ్మకున్నయది యిందేదేనిఁ గారణ ముండి తీర వలెను.

ద్రౌప॥ (తనలో) ఈమె వితర్కము కడు శ్లాఘనీయము.

ఉలూ॥ కారణము లేకేమి? "భీష్మునిఁ గపటోపాయమునఁ జంపినందులకై నాథునికి నరకబాధ తప్పక తటస్థించు" నని యొకనాఁడు వింటిని.

అర్జు॥ (తనలో) ఓహో! యిట్టిదుష్కీర్తి సంపాదించుకొంటిని.

క॥ హరిచెప్పఁ గాక యగ్రజుఁ డఱలేకటు లొప్పఁగాక యక్కట నేనీ
దురితమ్మొనర్ప నగునే? శరీరములు వోవుఁ గాని చనవపకీర్తుల్.

ధర్మ॥ (విచారముతో) అవును తమ్ముఁడా! దేహములు క్షణభంగురములు కాని, కీర్త్యపకీర్తులు కల్పాంతస్థాయులు

చిత్రా॥ ఎవరివలన.

ఉలూ॥ వసువులవలనను, భాగీరథివలనను.

ధర్మ॥ దేవీ! ఇక్కడికిఁ గొంత దేలినది.

ద్రౌప॥ తక్కినది గూడ విని కాని చెప్పఁ జాలను.

చిత్రా॥ ఎక్కడ?

ఉలూ॥ గంగయొడ్డున.

చిత్రా॥ తరువాత వారిని నీవేమి కోరితివి?

ఉలూ॥ "పాదములపైఁ బడి యీనరకమునకు నిష్కృతియేదేని యనుగ్రహింపక తప్ప" దని వేఁడుకొంటిని.

ధర్మ॥ సాధ్వీమణీ! మంచి యుపకారము నాచరించితివి.

చిత్రా॥ వారలే మనిరి?

ఉలూ॥ "ఇదితప్పక యనుభవించియే తీర వలసిన" దని నొడివిరి.

ధర్మ॥ సుకృతదుష్కృతము లూరక యెట్లు తీఱును?

చిత్రా॥ పర్యవసానమును దెల్పెదను.

ఉలూ॥ తుట్టతుదకు "నీతనికొమరుఁడు బభ్రువాహనునిచేతిలో నితఁడొకపరి మృతుండయ్యె నేని యితని కీపాపము తీఱు" ననిరి

చిత్రా॥ తరువాత.

ఉలూ॥ మాతండ్రియనుగ్రహమున నాకెట్టులేని "సంజీవనమణి యంతదుర్లభము కా" దని యెంచి "యట్లనే జరుగు నట్లనుగ్రహింపుఁ" డని కోరితిని.

ధర్మ॥ ఇక్కడికిఁ దెలిసినది. చచ్చినవాని నీమె సంజీవనమణిచే బ్రతికించినది. ఇంతకును నాతమ్మునకి గండము దాఁటి పోయినది. ఇఁకఁ గంగ యిచ్చిన శాపము మఱొక్కటై యుండదు.

ద్రౌప॥ నాథా! అట్లనే యగుఁగాక. కాని యిది నాటకము. ఎంతవఱకు సత్యమో?

బభ్రు॥ (తనలో) అట్టియుజ్జీవనౌషధ ముండుటం జట్టియే యీమె మాకలహమునకు సమ్మతించినది.

అర్జు॥ (తనలో) ఓహో! దీని ముఖ్యాంశమిది.

క॥ వసువులు గంగ యొనొక్కట, గుసగుసలాడంగవిని యిగురుఁబోఁడి తదీయ సమాచార మెఱిఁగి యు, వ్వసువులఁ బ్రార్థించి యిట్టివల నార్జించెన్

చిత్రా॥ అక్కా! నన్నొక్కటి యడుగుచున్నాను. "జగదేకవీరుఁడగు నాథుని నీశిశు వెట్లు జయింపఁ గలిగెనో!" యని సందేహించుచున్నాను.

భీమ॥ నాకును నిదియే గొప్పసంశయము.

ఉలూ॥ నేనప్పుడే వసువులను బ్రార్థించితిని.

చిత్రా॥ ఏమని.

ఉలూ॥ "మీరమ్మహామహుని జయింపఁ దగుసామర్థ్యము కొమరునకుఁ గలుగఁ జేయ వలయు" నని.

బభ్రు॥ (తనలో) ఇప్పటికి నేను నిరపరాధిని.

సహ॥ తగినంతతృప్తిగా లేదు. వసువులు రుద్రులకన్న నెక్కువవారా?

నకు॥ మహాదేవుఁడు భక్తపరాధీనుఁడుగదా? అయ్యనఘుని జయించుట మన మొక గొప్పగాఁ జాచుకొనఁ దగదు.

ధర్మ॥ తమ్ముఁడా! నీవు చెప్పినదే సదుత్తరము. పశువులకు మనపైనను గ్రహముండదు కదా?

గీ॥ ఒక్క వసునంశమగు భీష్మునోర్చుటకుఁద, రంబుగాదయ్యెను సమరమున మనకు
నట్టివారేడ్గురఁట! పయిననుజమరణ. కోపదూషితులఁట! యిందుదోషమేమి

చిత్రా॥ అక్కా! యింతపరిశ్రమము చేసినాథునికి నరకము బాపిన నీమేలు నేనేమని కొనియాడఁగలను.

ఉలూ॥ స్వకార్యమునకై యేనింత శ్లాఘింపఁదగను.

చిత్రా॥ కుమారా! జనకునకు నమస్కరించి క్షమాపణ కోరుకొనుము.

బభ్రు॥ (నమస్కరించి)

క॥ ఎఱిఁగియు నెఱుఁగక చేసిన, పొరపాటు క్షమించి నన్నుఁ బుత్రునిఁ బరమా
దర మొలుకు కటాక్షమ్ముల, నరయుము నీయాజ్ఞ యేదియైన నొనర్తున్

అర్జు॥ (కౌఁగిలించుకొని) తండ్రీ! నీవెందుకు క్షమింపఁబడ వలయును?

గీ॥ నరకము తరించుటకుఁగదా! నరులు కొమరులంగనుట నీకతన నాఫలమ్ముఁగంటి
నాత్మజుఁడు తండ్రికన్నను నధికుఁడైన, యుప్పుడేకద! తండ్రికి నబ్బు ముదము.

అనేకులఁ గొమరులఁ గన్నను, నేను నీకతన ధన్యుండ. నీమనమ్మున నిందులకు లేశమ్మును సంశయము వలదు. వచ్చు చైత్రపూర్ణిమనాఁటికి నీతల్లులిద్దఱితోడను నశ్వమేధమ్మున కరుదెమ్ము.

బభ్రు॥ (వినయముతో) జనకునియాజ్ఞ శిరసావహించితిని. తండ్రీ! యొకసారి పురమ్మునకు విచ్చేసి పిదప దయచేయవలయు" నని ప్రార్థించెదను.

అర్జు॥ కుమారా! నేను దీక్షఁ బూనినకతన నిప్పటికి రా వలనుపడదు. కావున నన్నుప రోధింపకుము. నీవు నీతల్లులతోఁ బురమ్మునకుఁజనుము. నన్నను పుము, నేనిం కను గాంధారాది దేశమ్ము లయ్యశ్వముతోఁ జరింప వలయును. ఇప్పటికే యన్న నాకై యెదురుచూచుచుండును. (అందఱును నిష్క్రమింతురు.)

(ఇది అంతర్నాటకము.)

ధర్మ॥ (దెసలు పరికించి) తమ్ముఁడా! యింతలో నెక్కడి కేగితివి?

ప్రాశ్ని॥ ఇప్పటికి నాటకము పరిసమాప్తమైనది. పాత్రములన్నియు నిష్క్రమించినవి

ధర్మ॥ చ॥ అతిగాఁ దురంగమున్ను వెను కజ్జుఁ డెంతయు కాల మయ్యె నం
గరములె తారసించెనో? సుఖమ్ముగ దేశము చూచుచుండెనో?
యెఱుఁగఁగ రాదు, వార్తయును నిప్పటి కియ్యెడ కంపఁ డయ్యెఁ ద
త్తఱపడు మానసంబకట! తమ్ముని జూడక యెట్లు లోర్చెదన్.

భీమ॥ అన్నా! సకలభూచక్రము గ్రిమ్మరి కాని రావలను పడదు కదా! అదికాక మధ్యమధ్య యుద్ధములు తటస్థించుచున్న ట్లిప్పటి నాటకమువలననే మనకు విస్పష్ట మగుచున్నది.

ద్రౌప॥ నాటకముమాట కేమిగాని తగినసహాయు లెవ్వరును లేకుంటచే నామనము కొందల మందుచున్నయది.

ధర్మ॥ అట్లనకుము? ఇదియును సత్యమే ధైర్యముండును "త్రికాలజ్ఞుఁ" డనికదా యుక్కువినిఁ బేర్కొనిరి,

నకు॥ దేవీ! అసహాయశూరునకు సహాయ మెందులకు?

క॥ ఖాండవ మేర్చెడుతఱిని, మండలిమరలించునపుడు మఱియెవ్వరు తో
డుండిరి కోరంగాతం, డొండెద్దియు గాండివమ్ము నొక్కఁడు దక్కన్.

సహ॥ దేవీ! పాంచాలి!

తే॥గీ॥ శూలికన్న నమరగులశూరులా యలు, లేరుగద! యమ్మహాత్మతోఁ బోరునపుడె
అన్నకు సహాయుఁడితరుల నెన్న నేల, యతనిలావు నెఱింగియు వెతలుదగున.

భీమ॥ తమ్ముఁడా! చక్కఁగ నొడివితివి.

క॥ అన్నయ యిటు లాచరించిన, వెన్నెనియుఁ గలవుడుతము. లిదియొక లెక్కా?
మొన్నటి బవరంబంతయు, నన్న పయిన్ వెల్లె నగట కథ్యంతరమే,

ధర్మ॥ అది యట్టిదియ, ఐనను నావిరికిఁ దగినట్టు వారు పాటు పడుటం బట్టి యే జయింపఁ గలిగితిమి, ఇందులో నొకరికొకరు దీసిపోవువా రెవరును గారు.

చ॥ అలఁగుదె? ద్రౌపదేయులు, మహాబలశాలి ఘటోత్కచుండు దాఁ
గొలఁదరయా? శౌర్యముల్లున కొండల సాటియా? సాత్యకిన్ దగన్
బలికిననోట నింకొకనిఁ బల్కఁదరంబె? కవల్ నిరర్థ్యులే?
బలమున నీకు సాటి యగుపార్థివు నొక్కని జేసెఁగంటిమే.

ద్రౌప॥ నాఁడు సౌగంధికకుసుమానయనమ్మున కియ్యవకు నంపినయది మొదలు నా కొంటిగా నిందెవ రెయ్యెడ కరిగినను మన సొప్పదు

ధర్మ॥ అవును. అప్పటియలజడి తీఱకుండునుకనే కాని మతియొక్కని కార్యార్థివక్కడి రక్కసుల బారిఁ జిక్కి కుంటుపడి యున్నాము. ఐనను గార్యావసరము పుట్టి యొంటరిగా నితని నంప వలసి వచ్చినది

నకు॥ "అవసరము లే" దని యూరకుండిరి గాని బావ నంపించో వెళ్ళనే వెళ్లును

సహ॥ అవును అట్లొనర్ప వలసినది. వారిరువురకును సఖ్య మసామాన్యము.

ధర్మ॥ నిజమే కాని, కొంచెము సంశయించితిని.

క॥ మనకును సంధియొనర్పఁగ, ననుపించిన నాఁటఁగో రోజాంతి యనుటయు
క్కని మేనమ్మను నెఱుఁగఁడి తని నీక మోమోట పెట్ట ధర్మం బగునే.

దౌ॥ద్వారకనుండి యెవరేని శ్రీకృష్ణునియనుచరులు వచ్చిరేమో? అసమీపమున నున్నయెడ జాడఁ దెలియ నయ్యెడిని. (అంతఁ గృష్ణుఁ డొకవార్తాహరునితోఁ బ్రవేశించును.)

కృష్ణ॥ (తనలో) పాండవాగ్రజుండు తమ్మునిజాడఁ దెలియమిని జింతిల్లుచుండం బోలు. పార్థుని యుదంతమును దేకొని వచ్చిన యీపశుపాలునిచే నతని మనోవ్యాకులతను బోఁగొట్టెదను. (సమీపించును.)

దౌ॥ అన్నా! యిప్పుడే నీమాట చెప్పుకొను చున్నారము. మాటలోనే నీవు వచ్చితివి.

ధర్మ॥ (పశుపాలు నుద్దేశించి) ఇతఁడు ద్వారకనుండి వచ్చెనా యేమి?

కృష్ణ॥ అవును మీతమ్ముఁ డితనిచేఁ దనకుశలవార్త నంపించినాఁడు.

భీమ॥ (ఆదరముతో) అతఁ డప్పుడే ద్వారకకు వచ్చి యట నుండి వెడలెనా యేమి? అట్లయినఁగొలఁది దినమ్ములన యిటకు రావచ్చును.

ధర్మ॥ ఓయీ! మాతమ్ముఁడు కుశలముగ నున్నాఁడు కద? నీపే రెవరు?

పశు॥ క్షేమముగనే యున్నారు. నాపేరు పశుపాలుఁడు

దౌ॥ (తనలో) అమ్మయ్యా! యిక్కడికి బ్రతికితిమి.

నకు॥ పశుపాలా! ఏమేమి సంగతులు చెప్పిపంపెను?

సహ॥ త్రోవలో నెక్కడెక్కడ యుద్ధములు జరిగినవో?

భీమ॥ "జరాసంధపౌత్రుఁడు మేఘసంధి తప్పక యశ్వము నడ్డగించు" ననియూహించెదను.

కృష్ణ॥ (నవ్వుచు) మీరందఱును అన్నిప్రశ్నలు వేసిన జేసికని యుత్తరము చెప్పును.

ధర్మ॥ ఓయీ! తక్కిన సంగతులు పిమ్మటఁ జెప్పవచ్చును. గాని యాతనికొడుకుఁ డగు బభ్రువాహనునికి నతనికిని సంగరము జరిగినమాట నిక్కమేనా?

పశు॥ ఆవిషయము నాతోఁ జెప్పలేదుగాని యాకుమారునిం గుఱించి మీతో నిట్లు మనవి చేయు మన్నారు.

ధర్మ—ఎట్లు?

పశు॥ క॥ అరుదేరఁగ నున్నాఁడం, బరచరులకు నేని నోరువఁగ రానిదురు
ద్ధరశక్తిబభ్రువాహనుఁ, డెఱిఁగి యతని గారవించు టెంతయు నొప్పున్

భీము॥ నిక్కముగా జరిగియే యుండును. లేనిచో నతని నంతగాఁ గొనియాడఁడు.

నకు॥ కొనియాడకేమి? అతఁ డతనిపుత్త్రుఁడు కదా!

సహ॥ అందుచేత నే నుతికిం దగకుండుట.

ధర్మ॥ ప్రధాన మైనయంశము నీ వెలిసికొన్నావు కావు. కానిమ్ము, ఇఁక నేమి సంగతులు చెప్పెను.

పశు॥ ఇదిగో! మనవి చేయుచున్నాఁడను.

తే॥ గీ॥ ధరణియెల్లను దురగమ్ము దిరిగెనచ్చ, టచ్చట నృపాలతనుజాతులడ్డపడియు
సంధియొనరించుకొనిరొక్క. సమరమునను, రాచకొమరులు గాలేదు రాజచంద్ర.

భీము॥ సంధియొనరించుకొన్నప్పుడు చచ్చుట యేల తటస్థించును?

ధర్మ॥ తరువాత. తరువాత.

పశు॥ క॥ బలములఁ జంపియు రథుల, నిలఁగూల్చియు సారథులనుహింసించియు భీ
తిలఁజేసి సంధికి నదిఁ, గలిగించితి వెల్ల రాచకొమ్మల కనఘా?

ధర్మ॥ తండ్రీ! మంచిపని చేసితివి. అంతమాత్రమును హింస జరుగకుండ నాలవే లేనది కాదేమి?

భీము॥ పశుపాలా! మేఘసంధిసంగతిని గుఱించి చెప్పవైతివి.

పశు॥ పూర్వమైత్రయును మదిఁ బెట్టికొని మేఘసంధి యశ్వము నడ్డగించినప్పు డాయన యిట్లనిరి నఁట.

ధర్మ——ఎట్లు?

పశు॥ క॥ మాయన్న "యేరినింజా, నేయకు, మని యాజ్ఞయిచ్చె నందులకనిన్
డాయంగ వచ్చెదవు పో, మ్మా! యసువులనీకు ధర మిమ్ముఁ బోనిమ్మా

నకు॥ ఇంతమాత్రమున కతడు మరలు వాఁడు గాఁడే!

పశు॥ క॥ అనుమాటలు చెవిఁబెట్టక, నను నారాచములఁ గొట్టినన్ నడుమ నెవా
నినిఁ దుత్రించి యతని రణసాధనములఁ దునుమాడితిని బ్రిదరములమాఁటన్

సహ॥ పాపము! విరథుఁడైనాఁడు ఇఁక సంధి సేయక చేసెడిదేమి?

పశు॥ ఆ॥ వె॥ అంతనీడఁబోక యాతఁడుగదగొని, ప్రళయకాలకమనుపగిదిఁగదియ
మెచ్చియొక్కయమ్ము వుచ్చి, యుగ్గదభగ్న. మొగనొనర్చి వానికొగినిటంటి

భీమ॥ చిన్నవాఁడైనను దాతతండ్రులపేరు నిలుపక పోలేదు, తరువాత,

పశు॥ క॥ నిలిపితివి తాతతండ్రుల, బలము పరాక్రమము యశము బాపురె? నీకుం
దలఁకఁబని లేదు పార్థ ముల్లలకుం దెగరమ్ము జన్మమునుగనుఁగొనఁగన్

నకు॥ పాపము. సిగ్గిలుచు "మంచిదే" యని తల యూచెను గాఁబోలును.

సహ॥ శకునికొమరుఁ డేమైన వద్దువచ్చెనేమో?

ధర్మ॥ అవును. అది ముఖ్యముగా వినఁదగినదియే!

పశు॥ శకునికొమరుఁడు తనబలములతో వద్దు వచ్చినప్పుడు మీతమ్ము లిట్లనిరఁట,

ధర్మ॥ ఎట్లు.

పశు॥ క॥ చిన్నతనము మానుము మా, యన్ననికన్ "జన్మమునకునరుఁడె" మ్మకెఁ
ల్వ స్నేము వచ్చితిని రా, వన్నా! బందుగులు కయ్య మాడుట తెన్నా.

సహ॥ అది యతఁడసమర్థతగాఁ బరిగణింపం బోలు

పశు॥ ఆ! మీరనినట్లే జరిగినది! అంత నతం డది పెడచెవినిఁ బెట్టి మీయన్నగారి
శరపరంపరలు నిగుడ్చుచుంగవియుటయు నాన్పవందనః శరమ్ముల వారిం
కిరీటమ్ము మాత్ర మొక్కయమ్మునఁ గూల నేసిరఁట.

ధర్మ॥ అంత నైన నతఁడు మరల లేదేమి?

పశు॥ అటుపై నేమి జరుగునో కాని, మంత్రు లడ్డమై యారాకొమరునియరదమ్ము
నుకకుఁ బట్టించుటయు కాక శరణమ్ము వేఁడికొనిరఁట.

భీమ॥ మంత్రులు తెలివి కలవారు గాఁ దోఁచుచున్నారు.

పశు॥ పిమ్మట మీసోదరు లిట్లు పలికిరఁట.

ధర్మ॥ ఎట్లు.

పశు॥ ఆ॥ వె॥ అన్న సెలవు లేమి యిట్లుండ మాయమ్మ, వంకఁ బుట్టినింటివారు
కానని తనినేను గాంధారనృపపుత్రిఁ, దలఁచి విడుచు చెట్లుశప్పదునుఁ

ద్రౌప॥ అవును. ఆయన నిట్లు గౌరవింప వలసినదే.

ధర్మ॥ ఇంతకును "కుశలముగా నున్నాఁ" డని చెప్పితివి, అంతే చాలును.

భీము॥ అన్నా! నాటకులవలనఁ జూచినయంశము నిక్కమే యగునా?

ధర్మ॥ నిక్కమే? కానిచో నతఁ డతని నంత "గౌరవముగాఁ" జూడుమని నొక్కి వక్కాణింప వలసి యుండదు.

నకు॥ ఇప్పుడో యిఁకనో అన్న రానే వచ్చుచున్నాఁడు. అన్నియును నతనివలననే తెలియఁగలవు. (అంత నర్జునుఁడు ప్రవేశించును)

కృష్ణు॥ (చూచి) అదుగో! మీతమ్ముఁడు వచ్చినాఁడు.

ధర్మ॥ (తత్తఱపాటుతో లేచి కవుఁగిలించుకొని)

క॥ తమ్ముఁడ! సేమమె గద దే, శమ్మునకున్ నేఁగఁ ద్రోవ సంగ్రామములే
యొమ్మెయి నడిచెను నశ్వము, నెమ్మెయి మరలించితి వచియింపుము నెమ్మిన్.

సహ॥ అన్నా! నీ వితనిని ముందుగాఁ బుమ్పుటచే నింకను నెన్నాళ్ళకో కాని రా వనుకొన్నారము.

అర్జు॥ ఇతనితోడనే నేనును ద్వారకనుండి బయలు దేఱితిని, పిదప యుద్ధమ్ము లెక్కడను లేమిం జేసి యితఁడు వచ్చునప్పటికే రాఁ గలిగితిని.

ధర్మ॥ అంతకు మున్ను విశేషించి సంగరములు జరిగిన వేమి?

అర్జు॥ జరిగినవి, కాని,

క॥ నీయాజ్ఞం దల నిడికొని యాయాదేశములకెల్ల నశ్వము వెంటన్
బోయి యిట తేఁగుదెంచితి, నేయెడలను నాకామరుల హింస యొనర్పన్.

నకు॥ అన్నా! బభ్రువాహనుం గుఱించి యంతగాఁ జెప్పి పుచ్చితివేమి?

అర్జు॥ అతని పరాక్రమం "బిద మిత్థ" మని చెప్ప నాతరము గాదు.

ధర్మ॥ అట్లయిన మేము విన్నసంగతి యథార్థమే కావచ్చును.

అర్జు॥ ఎట్లు వింటిరి? నే నితనితో నాసంగతి విస్తరించి చెప్ప లేదే?

ధర్మ॥ త్రికాలజ్ఞుఁ డగునొకకవి వ్రాసిన దృశ్యప్రబంధమువలన "నీశిరము నతఁడు దెగ వేసినట్లును మరల సంజీవనమణిచే బ్రతికినట్లును" గననయ్యె.

అర్జు॥ ఇంతయును జరిగినమాట సత్యమే,

ద్రౌప॥ నాథా! ముందుగా మీ రతని నేమంటిరి?

అర్జు॥ (సంశయించును)

కృష్ణ॥ బావా? సంశయ మెందుకు? నీ రంతయూ నెఱిఁగినదే, దానిని బుజువు చేసి కొనుటకుఁ గాఁ బోలును, అడుగుచున్నది.

అర్జు॥ మొదల నతఁడు తండ్రికొడంబాపవలసిన యాచారమును వినయమానుబాప నే నిట్లంటి.

అర్జు॥ తే॥ గీ॥ అడ్డఁ గలిగిన నశ్వమ్ము నడ్డ వలయు
నంతియే కాని "కొమరుఁడ" నందువచ్చు
టెదియు లోకరాచపాడియే యొఱుఁగఁ జెప్పుమ
"నాదుకొమరుండ" వనుటకు నమ్మకంబె.

ధర్మ॥ తమ్ముఁడా! యిప్పట్టిమాత్రము నీవు తొందరపడితివి సుమీ।

క॥ "జనకుఁడ" వనినను జేర్చిన, గనవచ్చిన పుత్రుఁ గాంచి కౌఁగిలియిడు పె
ల్లను బోయె నట్టులుండుము, "తనయుఁడఁగా" వనుట గొప్పతప్పిదముసుమీ!

అర్జు॥ (తలవంచుకొని యూరకొనును.)

కృష్ణ॥ (నవ్వుచు) ఇం దితని తప్పే మున్నది? కురువంశజాల కిది యొకయపూర్వము గాదు.

క॥ భరతుని దుష్యంతుండు కొమరుఁ డనియెఱిఁగియుఁ జేర్చ మన్నింపక పె
క్కురు గలసభ నవమానము, పఱపఁడె? తనజనని వెంట వచ్చినవానిన్.

ద్రౌప॥ (చిఱునవ్వుతో) అనుట కవకాశము గలుగుటం బట్టి కదా? యనుచున్నాను.

ధర్మ॥ ఇంతకును నియ్యది నీలోపము కాదు. శాపవశమున నీకట్టిబుద్ధి యనివార్యమై కలిగియుండును (కృష్ణుని నుద్దేశించి) బావా? నాతమ్ముని చెప్పినను నాక తన దుఃఖమే గాని సుఖము లేక పోయెఁ గదా!

కృష్ణ॥ ధర్మనందనా! ఎందుల కీయసమయనిర్వేదము! ఇది యాతనిలక్షణముల యందలిదోషమే కాని నీదోషముగాదు.

ధర్మ॥ తే॥గీ॥ అన్నియును మహారాజచిహ్నములె కాని, యేదెసను నీతనికిఁ దొసఁగింత లేదు
కష్టమే తప్పనకటా! సుఖమ్ము లింకఁ, జిక్కుటేక దేమి హేతువో? యొఱుఁగఁ జెప్పుమ?

కృష్ణ॥ ఈతనికష్టమునకే కాదు, యూవత్కుటుంబకష్టమునకును గారణమగుదోష మొక్కటి సర్వలక్షణలక్షితుం డగునితనియందుఁ జందురునకుఁ గళంకమువలె నున్నయది.

ధర్మ॥ అది యేయ్యది?

కృష్ణ ॥ఆ॥ వె॥ అన్నియవయవమ్ములనుగూపము లెయయ్యె, నూరులించుకంతయురువు లితని కక్కటనువనిట్టిరూపత్తు లబ్బె, మీకెల్లరకును, దీని నెఱుఁగు మధిప

ధర్మ॥ ఇది సామదిరిక శాస్త్రదోషము. దీని కేదేని యుపశాంతి యుండదా!

కృష్ణ॥ ఇది యిదివఱకే యనుభవము చేఁ దీఱిపోయినది. అయినను సర్వదోషహారం బగునశ్వమేధమును గావించుచునే యుంటివి. ఇఁక విచార మెందుకు!

(అంత ధౌమ్యులు ప్రవేశించుచును.)

ధౌమ్య॥క॥ మును లెల్లరు విచ్చేసిరి, జననాథతనూజులెల్ల జనుదెంచిరి యిం దునకేత్వఱఱినయులదివ, మును దాదాఁపయ్యె దీక్ష పూనుమూన్నృపతీ?

తే॥గీ॥ వేదఘోషమ్ము పురమెల్ల విస్తరించె, రాజరథఘోషములు పురిఁ జేజరిల్లె నందఱునునీదునభివృద్ధినాత్మఁ గోరి, యున్నవా, రింతకుమ మోపముంచుమనొ

ధర్మ॥ పరమసంతోషము, ఇదియుంతయును దమయాశీఃపరిభావనము, ఇయ్యనఘుని దయయును,

కృష్ణ॥ నీయదృష్టమును నీతమ్ముల భాగ్యరేఖయును,

చ॥ అరుల జయించి రాజ్యరమ నందితి వంతియకాక యన్నయోం తరం మది నిల్పెఁ దమ్ముఁడును గొప్పవిపత్తు తరించె ధారుణిం దిరిగి తురంగమ మ్మరుగుదెంచె, మునిప్రవరుల్ త్వదీయ్యమ ధ్వరము తిరమ్ముగా జరుప వచ్చిరి నిచ్చలు మోద మందుచున్.

ధౌమ్య॥ రాజా! నీకింతకన్న నేమి ప్రియము గావలెను. అయిన నిట్లగుఁ గాక.

భరతవాక్యము,

తే॥గీ॥ వేదశాస్త్రమ్ములందును విప్రులందు, గోవులందును సజ్జనకోటియందు బ్రజలకత్యంతసద్భక్తిపరిలబుఁగాక, క్షామమడుగంటుఁగాక సౌఖ్యమగుఁగాక

మఱియు,

క॥ మదిమెద మననెల్ల జనులు, స్వదేశరాజ్యాలను వారివర్తనలును వె
మ్మది కెక్కఁజేసికొని సత్పదమునవర్తింతు రిఁక పరమాత్మకృపన్
శ్రీ శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

గద్య

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి
బాలకలానిధి బాలసరస్వతీశతావధాని
తిరుపతి వేంకటేశ్వరవిరచితంబైన
పాండవాశ్వమేధమ్ము
నందు సర్వంబును
షష్ఠాంకము.
శ్రీ. శ్రీ. శ్రీ.




కమలాప్రెస్, కాకినాడ.

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 1 | గురువు వెవ | గురు వెవ |
| 3 | 7 | బయత్నింప | బ్రయత్నింప |
| 5 | 27 | గెడపితి | కెడపితి |
| 7 | 11 | ముందు కేగెద | ముందే గెద |
| 9 | 8 | [illegible] | [illegible] |
| 10 | 5 | విడచు | విడుచు |
| 11 | 2 | భీతు | బీతు |
| 11 | 25 | భ్రాంతి | భ్రాఁతి |
| 15 | 1 | దృటమే | దృష్టమే |
| 15 | 5 | మూనె | పూనె |
| 17 | 10 | వధించు | వధించి |
| 20 | 17 | గూర్పును | గూర్చును |
| 20 | 28 | నెంచి | సైఁచి |
| 22 | 5 | నన్ని | నిన్ని |
| 23 | 10 | భ్రాఁతిఁగ | భ్రాఁతిగ |
| 25 | 9 | ననుఁబోఁటి | ననుబోఁటి |
| 27 | 19 | ద్వాదశాబ్దముల | ద్వాదశాబ్దములు |
| 29 | 1 | యేడోయి | యేఁడోయి |
| 37 | 17 | యాడదగి | యాడఁదగి |
| 40 | 9 | రేనిమీ | లేనిమీ |
| 42 | 5 | కెనఁగా | కెనగా |
| 45 | 6 | ఒక్కటం | ఒక్కటఁ |

| పుట | పం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 46 | 6 | బుట్టెడు | బుట్టెండు |
| 47 | 18 | గలదు | గలరు |
| 51 | 12 | యొుక | యొక |
| 54 | 3 | కుర్రి | కుఱ్ఱ |
| 56 | 1 | చేసి | జేసి |
| 57 | 20 | డనై | డ[illegible] |
| 61 | 6 | క:డు | కుండు |
| 61 | 26 | క్రియని | క్రియఁ |
| 64 | 5 | ద్థాము | తాము |
| 66 | 19 | మము్మ | మమ్మ |
| 71 | 13 | జేయు | జేయు |
| 72 | 7 | దానివి | దానిని |
| 74 | 11 | దు్రంచు | తు్రంచు |
| 76 | 5 | య్యానఘు | యయ్యానఘు |
| 76 | 5 | గఁగఁ | గఁగఁగ |
| 76 | 23 | ల్వాద | ల్వాఁద |
| 79 | 10 | తువగు | తువకు |
| 87 | 12 | నీలోపల | లోపల |
| 87 | 20 | కాడో | కాఁడో |
| 92 | 18 | హాములు | దేహాములు |
| 97 | 14 | లడ్డపడి | లడ్డువడి |

